# స్రవంతి

సాహిత్య మాస పత్రిక

# 329


ఆగస్టు, 1981 : : సంపుటి : 28 సంచిక 5

వార్షిక చందా : పది రూపాయిలు : : విడిప్రతి : ఒక రూపాయి



సంపాదకులు :

డా సి నారాయణరెడ్డి

వేమూరి ఆంజనేయశర్మ

చిర్రావూరి సుబ్రహ్మణ్యం

# ఈ సంచికలో

సంపాదకీయం :

# అశ్లీల సాహిత్యం : ఒక ఆలోచన

అశ్లీల సాహిత్యం సమాజంపై నెరపే దుష్ప్రభావాన్ని గూర్చిన చర్చ జరుగుతూ ఉన్నది. ఇదివరకూ జరిగింది. ఇకముందూ జరుగుతుంది. ఇదివరకు అశ్లీల సాహిత్యానికి వ్యతిరేకంగా ఉద్యమాలు జరిగిన సందర్భాలు కూడా కాన వస్తాయి. హిందీలో ఈ శతాబ్ది ప్రథమచరణంలో మహావీర్ ప్రసాద్ ద్వివేది నాయకత్వాన ఈ ఉద్యమం చాల ఉద్ధృతంగానే సాగింది. తెలుగులో కూడ ప్రబంధ కావ్యాల శృంగార వర్ణన పద్ధతులను నిరసించడం ఆకాలంలో జరిగింది. ఒకదశలో శృంగారానికి అశ్లీలానికి మధ్య హద్దులు చెరిగిపోయి అంతా అశ్లీలమే అనే స్థితి కూడ ఏర్పడింది. అంతకు పూర్వం శృంగారవర్ణనల సందర్భంలో నిస్సంకోచంగా ప్రయోగింపబడిన శబ్దాలు కొన్ని పూర్తిగా నిషిద్ధాలయినాయి. భావకవిత్వం ప్రాదుర్భవించినవేళ అమలిన శృంగారం అమలులోనికి రావటంతో కవులు తమలోని శృంగారరససముత్సేకాన్ని వెలువరించడానికి ఇతర దారులను సృష్టించారు. భావకవిత్వం బాగా వ్యాప్తి పొందిన తరువాత ఈ ప్రతీకాలు సాధనాలుగా శృంగార స్ఫురణ బాగానే జరిగింది. ఇదివరకు శృంగారం వర్ణిత మయ్యేది, ఇప్పుడు శృంగార స్ఫురణ జరిగేది. కాని రెంటికీ పరమార్థం మాత్రం ఒక్కటే. ప్రాచీనులు తాము చెప్పేది నిస్సంకోచంగా చెప్పేవారు, భావకవులు ఏవో పై పూతలు పూసి భయపడుతూ భయపడుతూ చెప్పేవారు.

రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత మన దేశ సాంఘిక దృక్పథంలో పెద్ద మార్పు వచ్చింది. దేశంలో విద్యా ప్రచారం ఎక్కువ అయింది. అయితే అది ఒక నిర్దిష్ట లక్ష్యం కలిగి మనిషి అవసరాలతో పాటు నైతిక విలువలను కూడ ప్రాధాన్య మిచ్చేది కాకపోవటంతో అది చదువుకున్నవారిలో స్వార్థపరతను పెంచేదిగా తయారయింది ఇంగ్లీషు వారు మనలను సాంస్కృతికంగా బలహీనపరచి వదలి వెళ్ళిన వారసత్వం ఈ విద్యావిధానం.

స్వాతంత్ర్య పోరాట సమయంలో మన బలహీనతలు చాల వరకు అణగి ఉండేవి. స్వాతంత్ర్యం రాగానే బలహీనతలు ఉవ్వెత్తున బహిర్గతమయినాయి. మన నాయకులు విలువలను త్యజించి రాజకీయాలను కలుషితం చేశారు. అది పాలనా వ్యవస్థలో ఉన్నవారికి మంచి అవకాశంగా కన్పించింది. రాజకీయ నాయకుల దౌర్బల్యాలను పూర్తిగా వినియోగించు కొన్నారు వారు. వీరిద్దరిని వినియో

గించుకొని తాము ఇంకా ఇంకా బలపడ్డారు సంపన్న వర్గాలవారు. అందరి లక్ష్యం ఒక్కటే అయింది- ఏదో విధంగా డబ్బు కూడబెట్టటం- సంపన్నులు కావడం. ఈ కూడబెట్టాలనే కోరిక-అర్థస్వార్థం- ఎవరో కొందరికే పరిమితమై లేదు. సంఘంలో ప్రతివాడు దీనికి లోనైనవాడే. నాయకులు, పాలకులు, సంపన్నులు అని లేదు. అట్టడుగున ఉన్నవారిలో కూడ ఈ స్వార్థం చోటు చేసుకొంది. అవకాశం రాగానే అది తన వికరాళ దంష్ట్రలను మెరిపిస్తుంది.

ఆర్థికంగా కొంత బలం పుంజుకోగానే మనిషిలో విలాసలాలస జనించి పెరుగుతుంది. అశ్లీలం ప్రధాన విలాసాంగం. సంస్కారం లేని చదువు, అపమార్గాన సంపాదించిన ధనం- ఈ రెండూ అశ్లీల వాంఛలను వృద్ధి చేసేందుకు, తీర్చుకొనేందుకు దోహదం చేస్తాయి. సంస్కారం లేని చదువులు చదివినవారు మరి ఈనాడు చాలమంది రచయితలుగా- మారి చలామణి అవుతున్నారు. సంస్కారం లేని చదువువులు చదివిన రచయితలు- సంస్కారం లేని చదువులు చదివిన పాఠకులు! ఆ సాహిత్యం అశ్లీలం కాక మరొకటి ఎలా అవుతుంది ?

అసలు ఈనాడు అశ్లీలానికి నాగరిక సమాజం అనబడేదానికి విడదీయరాని సంబంధం ఉన్నది. ఒక ఉదాహరణ చాలు-కట్టుకొనే బట్ట మొదలు వాటిని ఉతికే సబ్బుల వరకు- అశ్లీలం మాధ్యమంగానే మనముందుకు వస్తున్నాయి. ఈనాడు మాడలింగ్ ఒక కళ, మరి ఆ కళ అశ్లీలపు హద్దులను తాకకుండ ఉన్నదా? ఆ కళకు మాటలు ఇచ్చే సాహితీపరులు !! ఇక సినిమాలు సరేసరి. ఇది వరకు దాగి ఉండడం సౌందర్యంగా ఉండేది. ఇప్పుడు బహిఃప్రకాశం దాని లక్షణం.

సుసంస్కారం కలవాని చదువు, ధనం, పదవి, విలువలు కలిగి ఉంటాయి. చదువు, ధనం, పదవి విలువలు లుప్తమైనవిగా ఉంటే అవి కలవారి అభిరుచులూ తదనుగుణంగానే ఉంటాయి. ఇది మొత్తం సమాజానికి పట్టిన జాడ్యం. కనుక ఏదో అశ్లీలమని అది ఎవరినో పాడు చేస్తోందని వాపోవటం నిరర్థకం. అలా అనే వారు కూడ తమ నిజాయితీని గురించి ఆలోచించడం మంచిది.

:o:-

# ఎక్కట్లు

-తుమ్మల సీతారామమూర్తి

అతిసంచయేచ్ఛ వదలిన
నతీవధైర్యమ్ము శాంతి యగ్గంపడు, నీ
బ్రతుకున కీ భాగ్యమునకుఁ
బతత్రి తార్కాణ మంద్రు పండిన పెద్దల్.

నరుఁ డక్కఱలేనిసిరిన్
వరించి చెడురీతి నతఁ డనావశ్యకధీ
పరిణతి నాసించియుఁ జెడు;
దురాశ యెదియైన నరు నధోగతి కీడ్చున్.

సిరి తొలంగుఁగాక పరువు డుయ్యునుగాక
తెగులు క్రమ్ముఁగాక పగ కలంచుఁ
గాక చావు మూఁడుఁగాక సత్యాన్వేషి
విడువఁ డభయముద్ర; వీరుఁ డితఁడె.

వినయమునకు నహింసకు వేర్మి లేదు,
నిలదహంకృతి నమ్రత నిలుచుచోట,
నిలుచునే నది ధూర్తవినీతి, మొదవు
మోముపులి, బూదిలో ముచ్చముడిఁగినగ్గి.

ల దక్కు నని తలంచెనా మందర
గిరిని మోయునాఁడు కేశవుండు
తలఁపకున్న నేమి తప్పదు ఫలము ని
ష్కామయోగదీక్ష గన్న కృతికి.

అప్పికట్ల,
గుంటూరు జిల్లా,

# కొత్త వూపిరి—హంటరు తిరగబడింది

—నత్తినేని హరికృష్ణ

నల్లటి ఉక్కుమేనుపై
ఎర్రటి కొరడా మెరుపులు
'ఛళ్' మని ఉరుముతున్నాయి.
దొరగారి చేతిలోని హంటరు
మదంతో బుసలు కొడ్తోంది.
ఇనుప పాదాల క్రింద
నలిగిన మట్టి
గాలిని కౌగిలించుకుని
కనురెప్పలను దురుసుగా
గదమాయిస్తే,
భయాన్ని జీర్ణించుకున్న
గాజు దీపాలలో
జాలి ప్రసవిస్తోంది.
కన్నీటి నెత్తురు
తప్పు కాయమంటూ
కాళ్ళపై బడి వేడుకుంటోంది.
కన్నీటితో కరగని హంటరు
శివమెత్తి ఆడుతూనేవుంది.
గొడ్డుచేలో పడ్డా
గడ్డిపరకపై చేయేసినా
దొరగారి కొరడా మాత్రం
జాతి భేదం చూపించదు.

అలిసి పోయిన హంటరు
నేలపై సొమ్మసిల్లింది.
ఎర్రటి నెత్తురుతో
ప్రాణం పోసుకున్న
మట్టిని చూసి
నల్లటి ఆకారంలోని
గాజుగోళాల్లో
విప్లవ దివిటీలు
భగ్గున లేచాయి.
తిరిగ్గా పడుకున్న హంటరు
ఒక్కసారి ఒళ్ళు దులుపుకుని
దొరగారిపై తిరగబడింది.
తిరగబడ్డ హంటరుకు
అండగా వేయి చేతులు
పిడికిళ్ళు బిగించాయి,
ఉక్కు పిడికిట్లో
హంటరు తిరగబడుతూనే వుంటుంది.
గాజు గోళాల్లో
నిత్య విప్లవం జీర్ణించుకుంటున్న
దివిటీలు ప్రచండ జ్వాలలై
మండుతూనే వుంటాయి.

H. No. 1-8-425, చిక్కడపల్లి,
హైదరాబాదు-500020.

# స్నిగ్ధప్రేమ

—జి. శ్రీశైలం

భక్తపాలన కళాకేళిలో
భక్తులు తన్మయులై పోతున్నారు
సామూహిక సమారంభంలో
సందడిగ సరిగమలు మీటుతున్నారు
నేను మాత్రం ఒంటరినై
ఎక్కడో మ్రోగుతున్న
అమర వీణను వింటున్నాను
ఆనందోబ్రహ్మ అనుకొంటూ ఉన్నాను
ఇంపైన భావ వీధులలో
కెంపులు గుమ్మరిస్తూ
సొంపుగ నాట్యమాడుతు
ఎదలను దూసి ఇవ్వాలనే
అందాల రమణులు
గుంపులు గుంపులుగా తరలి పోతున్నారు.
వారి పాదముద్రలో పసిడిపూవులు
తెచ్చి కప్పాలని ఉంది
ఆరాధించాలని ఉంది
వీరు గంధర్వ జాతి కన్నెలు
వెనుదిరిగి చూశారు కాబోలు
ఆవేదనా పరుడనై వెన్నునంటి వస్తున్న
ఆసక్తిని పసికట్టారు.
అందమైనవాడే మనవైపే వస్తున్నాడని
విప్పారిన కనులతో రెపరెపలను మరచి
ప్రాణాలు చూపులుగా మార్చుకుని
పరికిస్తున్నారు.
స్వప్నాల సముద్రంమీది నావలా
పచ్చతోరణాల స్వాగతా లాలపించు
అమర గాయకుడుగా
మత్తుకళ్ళలో వొత్తి గిల్లిన పత్తిపూలు
వెలుతురు జిమ్మాలని
ఆరాట పడుతున్నాడు.
మానవలోకానికే దొరకని
మార్గాలెన్ను కున్నాడు.
మనల్ని ప్రేమించాడో లేదో కాని
ఊహాలోకాల ఉదయభానుడిలా
విశ్వ శ్రేయస్సును కోరు
వీరుడిలా కనిపిస్తున్నాడు.
గలగలమని అలిగిలితో
కురిసింది పూలవాన
ఉప్పొంగిన స్వేదజలం ఆరిపోయింది.
సర్వాంగమంతా పరిమళంగా మారింది
తానో పూలతీగై పోయాడు
ఎల్లవేళలా ఇలానే ఉండాలని కాంక్షిస్తు
న్నాడు
మలినమైన మనిషి జన్మ ఎందుకు
పగిలిపోయిన పడవ అని వాపోయాడు
పూలు కురిసిన రాత్రి
హాయిగా నిదుర పోతున్నారు
శ్రామికశక్తుల కనులపైన అందమైన నిదుర
కోమలి కౌగిలిలో ఒకడు
కమనీయ సంగీత రసాస్వాదనలో ఒకడు
నిత్యావృత్తి కృషిలో ఒకడు
రేపేంచేయాలి ఎప్పుడేంచేయాలి
అని కలలు కంటున్నారు.
నేను మాత్రం
నన్ను అడిగేవాడే లేడని
పరసేవయే భవితవ్యంగా
స్నిగ్ధప్రేమయేకర్తవ్యంగా
అందరినీ అడిగేవాణ్ని నేనేనని
పలకరించడానికి బయలుదేరాను. *

2-3-720/14, గంగానగర్,
హైదరాబాదు.

# గోల్డ్ మాణింగ్ స్వీట్ ప్రిన్స్

ఆంగ్ల మూలం
డెల్మోర్ స్క్వా(ర్)ట్జ్

అనువాదం
వై. వెంకట్రామయ్య

విషాద, భావోద్రేక, ఆనందపు ఆవన్ ఆటగాడు అత్యద్భుతంగా చిత్రించిన
జీవితవైవిధ్యం సముద్రమంత విశాలమైనది.
ఆ సముద్రాన్ని వినయశీలురుగాని, అహంభావులుగాని
అడ్డలేరు, ఆపలేరు, అజమాయిషీ చెయ్యలేరు.
మన జీవితార్థం ఏమైనప్పటికి, ఎక్కడ నుండి మనం వచ్చామో,
ఎక్కడకు పోవాలని ఆశిస్తున్నామో, అన్వేషిస్తున్నామో
అన్నీ అతనికి తెలుసు
మూర్ఖులు, మౌనులు, పవిత్రులు, శక్తిపరులు అందరూ ఆయనకు తెలుసు.
అదృష్టానుభవం, ఆకస్మికయశస్సు, తారుమారయిన పరిస్థితులు,
సముద్రంమీదగాని, భూమిమీదగాని తప్పించుకోలేని నష్టం
అన్నీ ఆయనకు అవగతమే.
మర్త్యుల అమరత్వం, అవసరమైన అనిశ్చిత-ఆయనకు తెలుసు
గొప్పతనం యొక్క వాస్తవం-ఆయన ఎరుగును.
నయవంచన యొక్క బెదురుచూపులు, హింసాయుతశక్తిని ఆయన చూశాడు.
కామాంధపుపోరలను, విలాసవంతులను ఆయన ద్వేషించాడు.
సత్యం, ఆశ, విశ్వాసం, దయలను ఆయన విశ్వసించాడు.
భూత, భవిష్యత్, వర్తమానాలను ఆయన చూశాడు.
సౌమ్యుడైన భూపతి నిస్సహాయ నిద్రలో హత్య చెయ్యబడ్డాడు.
ఓ బాలిక నయవంచనచే మానం కోల్పోయింది
ఓ బాలుడు దురాశా రాక్షసుని కత్తిపోటులకు బలి అయ్యాడు.
ఓ సతీమణి, నమ్మకస్తుడు, సాహసవంతుడయిన భర్తచే
ఓ చేరుమాల కారణంగా అన్యాయంగా శంకించబడి,
ఆత్మద్వేషి అయిన దుర్మార్గుని వాక్ప్రవాహపు నేర్పుచే
ప్రేమ, అమాయకత, నమ్మకాలచే చంపబడింది.

అనంతమనే నదిలో ఒఫీలియా పలవరిస్తూ విశ్రాంతి తీసుకుంటున్నది.
వలదు వలదు వలదు వలదు వలదు
కార్డీలియా శ్వాస కోల్పోయింది.
పొగడ్తలు తెలివైనవని, మాటలు తేలికని, భావనలు చౌక అని,
వాగ్దానాలు, ప్రమాణాలు విలువలేనివి అని ఎట్టకేలకు లియర్ తెలుసు
కున్నాడు.

నిజమైన ప్రేమ కొన్నిసార్లు మూగదని, అన్నివేళలా విశ్వసించవచ్చని
తెలుసుకున్నాడు. చిట్టచివరకు—
కాని ఆలస్యంగా చాలా ఆలస్యంగా ప్రేమ తనకు అతి సమీపంగానే
ఆపేక్షతో వున్నదని—ఆకళించుకున్నాడు.
హృదయాలన్నీ, బాలికలందరూ మోసపోవలసిందేనా ?
కామం, అయిష్టత, అపనమ్మకాలకు ప్రేమ ఎప్పుడూ దూరంగా మనలేదా?
డంకన్ సమాధిలో వున్నాడు.
దుఃఖించటానికి, ప్రార్థించటానికి, పిచ్చి ప్రేలాపనకు కొద్ది సమయమివ్వబడిన
డెస్డిమోనా విల్లోచెట్టుక్రింద కన్నీరు కారుస్తూ వుంది.
ఏకైక, శాశ్వత, సంపూర్ణ సత్యం ఇదేనా?
ఉదాత్తులు, అమాయకులు, సమర్థులు, సాహసవంతులు,
కొన్నిసార్లు—తప్పకుండా కొన్నిసార్లు—విజయం సాధిస్తారు.
అయినప్పటికి, క్రూరత్వానికి పట్టుబడి నమ్మకంచే జీవాత్మ చంపబడుతుంది.
ఎక్కడుంది మనకు ఓదార్పు—మృత్యువుకి ముందా, వెనుకా?
అంతా పరిపక్వతే; మిగిలేది నిశ్శబ్దం అంతా ప్రేమే;
అంగీకరించబడి, తిరస్కరింపబడి, వాసితప్పి, దాడి చేయబడి, మోసగించబడి-
ప్రేమతో తయారు చేయబడిన పదార్థమేనా మనం?
కొందరు ఓడిపోయారు, కొందరు కష్టపడ్డారు, కొందరు పరిణతి చెందారు,
కొందరు పుష్పించి సఫలత చెందారు-

సహనమనే శక్తితో నల్లని వేరు గుండ్రని ఫలంగా మార్చిన రీతి తెలుసుకుని.
అది సత్యం కాకపోతే, ప్రేమలో దయ, క్రూరత్వం, అన్యాయం లేకపోతే,
హృదయలేమి, అణచలేని తనం లేకపోతే,
పండితునికి ఖేదం, పామరునికి మోదం లేకపోతే,
పరి పక్వతతో, వైరుధ్యంతో, భోగ లాలసతో,

క్రూరంగా, సౌమ్యంగా ,సింహానికి, గొర్రె పిల్లకి జన్మిస్తూ
నెమలి, వేటకుక్క, పెద్దపులి, బల్లి, డేగ, పావురం
అన్నీ ఏమీ కాదు, అన్నీ విలువ లేనివే, ఏదీ సరిపోదు,
ప్రేమ ప్రేమకాదు.
ఎవరూ ఓడక ఆట లేదు, గెలుపు లేదు.
ఎప్పుడూ ప్రేమించక, నిర్జీవంగా, అజ్ఞానంలో ఉండాలంటే తప్ప.
ప్రేమించటం తప్ప మరో మార్గం లేదు.
నాశనమై పోయిన, నిరాశా జీవులతో గొంతు కలిపి అన్ని వేళలా
ప్రేమ 'ప్రేమకాదు' అని శోకిస్తూ చీకటి నావలో దాక్కుంటే తప్ప,
ఆశాచైతన్యాన్ని కోల్పోతే తప్ప, ఆశా వాస్తవాన్ని తిరస్కరిస్తే తప్ప,
తెలియని, దాగిన, అంతిమ ప్రేమ దిగివచ్చే వరకు
పవిత్ర ఆలయం ఇది, పిచ్చాసుపత్రి ఇది.
సువర్ణ ప్రభాతం, ఓ రాకుమారా, నల్లని రాత్రులు ఎల్ల కాలం దిగి వచ్చాయి,
అంతమయ్యాయి.
స్వర్ణ ప్రభాతమో ఆవన్ రాకుమారా, వాస్తవం, ఆశ, వాక్కు మూర్తీభవించిన
సాహితీ సార్వభౌమా,
దేవతలందరూ, నీవు ఆలపించిన విధంగానే, మధురంగా, సత్యంగా ఆలపింతురు
గాక.

# దాశరథి కవితాభ్యుదయం "మహాంధ్రోదయం"

డా॥ జి. బి. ఎన్. ఆచార్యు; ఎం.ఏ.పి. హెచ్.డి.

"అరిశిరస్సుల నుత్తరించిన
అలుగునేనే, తెలుగునేనే!
అఖిల జగములు చుట్టివచ్చే
పులుగునేనే, తెలుగునేనే!
తెలుగునేనే, వెలుగునేనే!"

అని విశ్వరూపాన్ని ప్రదర్శించిన మహాకవి దాశరథి. "మహాంధ్రోదయం" తెలుగు ఊరులు, తెలుగు వారలు ప్రతి ఫలించే మహాకావ్యం. దాశరథికి కావలసింది మహాంధ్రోర్వర. అందుకే తూర్పుదారి కెదురుగానున్న ద్వార బంధాన్ని, మనిషి మనిషి మనస్సు దారుల రాగ బంధంగా వీక్షించాడు; మూడు కోటుల నొక్కటే ముడిబిగించి, మహాంధ్ర సౌభాగ్యగీతాన్ని ముక్తకంఠంతో ఆలపించాడు.

"చెట్లకి ఆకులు వచ్చినట్లుగా కవికి కవిత్వం రావాలి. లేని కవితావేశాన్ని బలవంతాన తెచ్చి పెట్టుకో కూడదు. కవిత్వం సహజంగా రావాలి."1 అన్నంత సహజమైనది దాశరథి కవిత్వం. అందుకు ఈ క్రింది ఒక్క పద్యం చాలు ఉదాహరణకి.

"నేనురా తెలగాణ నిగళాలు తెగగొట్టి
ఆకాశమంతయెత్తార్చినాను,
నేను రాక్షసి గుండె నీరుగా, పద్యాలు
పాడి మానవుని కాపాడినాను,
నేను వేస్తంభాల నీడలో నొక తెల్గు
తోటనాటి సుమాలు దూసినాను,
నేను పోతన కవీశాను గంటములోని
ఒడుపుల కొన్నింటి బడసినాను,

కోటి తమ్ముల కడ రెండు కోట్ల తెలుగు
టన్నలను గూర్చి వృత్తాంతమందజేసి
మూడు కోటుల నొక్కటే ముడిబిగించి
పాడినాను మహాంధ్రసౌభాగ్యగీతి."

తెలంగాణాలో దేశాభిమాన ప్రబోధక గీతము లాలపించిన కవి కుమారులలో దాశరథికే అగ్రతాంబూలం లభిస్తుంది. నేడు చాలా మంది కవుల్లోవున్న అనుకరణశక్తి దాశరథికి లేదు. ఆయనదారే ఆయనది. ప్రజ్ఞతో తాను మలచు కొన్నదే తన త్రోవ. ఇతర కవులు తనను అనుకరించేట్లు చేసుకోగల ప్రతిభా సమన్వితుడు దాశరథి. అందుకే దాశరథి తెలంగాణా నవ్యయువక సాహిత్య రాజ్యానికి అధిపతి; తెలంగాణపు వైతాళికుడు అయినాడు. అంతేగాక ఆంధ్ర ప్రదేశ్‌లో అగ్రశ్రేణికి చెందిన కవిగా విశిష్ట స్థానాన్ని సంపాదించాడు.

కవిత్వానికి ప్రధానమైనది భావావేశం. ఇది దేశ భక్తి కవిత్వానికి ప్రధాన లక్షణం. ఈ లక్షణం దాశరథి కవిత్వంలో విలక్షణంగా ఒదిగిపోయింది. దాశరథి 'కవితామూర్తి' ఆకాశమంత ఎత్తు ఎదిగిపోయింది. ఈ విషయం దాశరథి ఏ కావ్యాన్ని పరిశీలించినా విశదమవుతుంది.

1. భావవీణ : శ్రీఅమరేంద్ర. పుట : 87.

విశాలాంధ్ర నిర్మాణ సమయంలో ప్రత్యేక తెలంగాణా వుద్యమం బయలుదేరి, పరిస్థితులు ఒడుదుడుకులుగా వున్నప్పుడు వెలువడిన ఈ "మహాంధ్రోదయం" తెలంగాణా వైతాళికుడైన కీ.శే. సురవరం ప్రతాప రెడ్డి గారికి అంకితం చేయబడింది. అప్పటి హైదరాబాద్ ప్రభుత్వం నడిపిన పోటీలో ఈ కావ్యం ప్రథమ బహుమతి పొందింది. అన్నిటినీ మించి, ఆంధ్రప్రజానీకాన్ని బాగా ఆకర్షించింది.

"మహాంధ్రోదయములోని దాశరథి కావ్యములన్నియు దేశాభిమానపూరితములయినవే. ఈ కావ్య జలదములన్నిటిలోను ఆంధ్ర దేశ చారిత్రక సంగతులు తటిల్లతల్లట్లు మిరు మిట్లు గొలుపుచు మెరసి, మన హృదయాకాశమును రేఖాబహుళమైన పురాతన చారిత్రక దీప్తితో ఉత్తేజితము కావించి ఉల్లాసము కలిగించు చుండును. తత్తత్ స్మృతి జన్యమైన దర్పానుభూతి మనకొక నూతన చైతన్యము నుద్దీపింప జేయు చుండును."2 అనిసుప్రసిద్ధ చరిత్రకారులు,పండితులు, విమర్శకులు అయిన శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు ఈ కావ్యానికి యోగ్యతా పత్రాన్ని బహూకరించారు. ఇంతటి గొప్ప బహుమతిని పొందటం దాశరథి అదృష్టం. ఇంకా డా॥ బూర్గుల రామకృష్ణారావు, డా॥ బెజవాడ గోపాల రెడ్డి గార్ల ప్రశంసలను కూడా అందుకున్నదీ మహాంధ్రోదయ మహాకావ్యం.

మాతృభూమిని, మాతృభాషను మహోన్నతంగా సంభావించుకొని, పులకించి పోవటం దేశభక్తి కవుల ముఖ్యలక్షణం. ఇది దాశరథిలో హిమగిరిశృంగ సన్నిభంగా మనకు దర్శనమిస్తుంది. "తెలంగాణ" అనే ఖొకటి ఖండికలో మాతృభూమిని, మాతృభాషను వేనోళ్ల ప్రశంసించి, మైమరచి కలాన్ని నడిపించటం, గళాన్ని వినిపించటం జాతీయోద్యమ ప్రభావానికి చిహ్నమే అని చెప్పవచ్చు.

"కోటి తెలుగుల బంగారు కొండ క్రింద
పరచు కొన్నట్టి సరసు లోపల వసించి
ప్రొద్దు ప్రొద్దున అందాల పూలు పూయు
నా తెలంగాణ తల్లి కంజాతవల్లి"

అనటంలో "జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అనే ఆర్యోక్తి అభివ్యక్తమవుతున్నది. "ఉన్న ఊరు కన్నతల్లి వాక్కు రూపుగాదె" అనే శ్రీనాథుని సూక్తి ననుసరించే దాశరథి "నా తెలంగాణ తల్లి" అని హృదయ పూర్వకంగా సంభావించుకున్నాడు. తనను కని, పెంచి, పెద్దజేసి, మహోజ్జ్వల జీవితాన్ని ప్రసాదించిన తెలంగాణ తల్లిని కంజాత వల్లిగా కొనియాడి తన కృతజ్ఞతను తెలుపుకున్నాడు. ఇంకా దాశరథి తెలంగాణ—కోటి అందాల జాణ; కోటి రత్నాల వీణ.

"మహాంధ్రోదయం" అనే ఖండికలో—

"నీ వెరుగవె? శ్రీరాముడ
నేను మానవుడనె లెమ్ము;
నిద్రాణాంధ్ర ధరాస్థలి
నేడు మేలు కొల్పగలను."

అని మానవ మహోన్నత్యాన్ని ధ్వనింపచేసాడు. మానవుడైన శ్రీరాముడు సాధించిన లోక కల్యాణం దాశరథికి ఆదర్శం. అందుకే ఆయన మానవత్వాన్ని విస్మరించలేదు. "నేను శ్రీరాముడ" అన్న కవి నిజంగా శ్రీరాముడే ఎందుకంటే "దాశరథి" కదా!

దేశభక్తి కవిత్వంలో "నదీప్రశస్తి" కూడా ముఖ్యమైనదే. దాశరథి కృష్ణ, గోదావరి మొదలైన ఎన్నో నదులను, వాటి మాహాత్మ్యాన్ని కీర్తించాడు.

"నా తల్లి కృష్ణవేణమ్మ కన్నీరొత్తి
కొనుచు నాపై ప్రేమ మినుమడించె
గోదావరమ్మ సమ్మోదమ్ముతో నాకు
ముఖ మార్జనకు జలమ్ము లనొసంగె

2. మహాంధ్రోదయము : పీఠిక. పుట: xiii

తుంగమ్మ తనపైట కొంగుతో నామోము
తుడిచి నిద్దుర భారమడచివేసె
పెన్నమ్మ తన పయః పీయూషమునొసంగి
ఆకలి మంట చల్లార్చివైచె

మూడు చెరగుల నేలల మూడు కోట్లు
ముడివడిన యట్లు కన్నుల ముందుతోచె;
అందలము నెక్కి, యావజ్జనాళి మచ్చ
సుందర విభాతమేతెంచె తొందరించి."

పై పద్యంలో పేర్కొబడ్డ నదులన్నీ తమ పవిత్ర జలాలతో ఎన్నో క్షేత్రాలను పరమ పావన మొన రించి, ఎనలేని సస్యరాశిని పండించి మానవుల ఆకలి మంటలను చల్లార్చగల "అన్నదాత" లని ప్రశంసిం చటం దాశరథి విశిష్టతను చాటుతున్నది. ఇంకా, తెలంగాణాలోని నిజాంసాగర్ ప్రాజెక్టు నిర్మాణానికి ఆధారభూతమైన "మంజీర" నదిని సుదీర్ఘంగా వర్ణించి, పొగడ్తలతో ముంచెత్తాడు. "మంజీర"లో దాశరథి ఆవిష్కరించిన దేవీ సాక్షాత్కారం కన్నుల పండుగైనది. దేశభక్తితో పాటు, దైవభక్తిని కూడా రంగరించి అచ్చుపోసిన ఈ ఖండిక కావ్యానికి మణిదీపిక.

"నీవు దూకిన నేల మాకు విద్యున్మాల
నీవు ప్రాకిన పథము మాకు చైత్రరథమ్ము
ఎవరి కొరకయి పరుగులెత్తి వచ్చితివి?
ఎవరి జూచి తటాకమై ఎల్చి పోతివి?"

అని ఆనందంతో, ఆత్మీయంగా ప్రశ్నించిన దాశ రథికి మంజీర-దేవీ సన్నిభమైనది. అందుకే-

"ఎవ్వరే యెమరొచ్చి ఏడు పాయలు చేసి
రవ్వల్ల వీణపై రాగమొత్తిరి నిన్ను?
ఏడు పాయల దుర్గ[3] యేమన్నదే నిన్ను?
యేమన్నదే నిన్ను యేడుపాయల దుర్గ?

ఏడు పాయల దుర్గ ఎదురుగా వచ్చింది
పాడుకొమ్మన్నాది పరుగులిడమన్నాది
స్వరమొక్క పాయగా సాగి పొమ్మన్నాది
బంగారు పండించి ప్రజల కిమ్మన్నాది."

అని మంజీరను విశిష్ట రీతిలో కొనియాడుతూ, ఇంకా-

"రుద్రవీణ తీవమాద్రిఝుంఝుమ్మని
తరగలెత్తి వచ్చుదాన వీవు;
నా మనస్సులోన నాదాలు కల్పించి
స్పందనమ్ము నేర్పజాలినావు"

అని తన హృదయ స్పందన కాస్పదమైనదని మంజీర మధుర చైతన్య వ్యక్తిత్వాన్ని చిత్రించాడు.

ఇక్షు దండాలను విరివిగా పండించి, తెలంగాణా రైతుల బతుకులను బంగారమొనర్చిన మంజీర నదీ మతల్లికి దాశరథి కోటిమాటల దండాలతో, కావ్యనీ రాజనాన్ని సమర్పించి, తన వ్యక్తిత్వానికి మరింత వన్నెను సమకూర్చుకున్నాడు.

పూర్వ కవుల ప్రశంస కూడ దేశభక్తికి ముఖ్య మైనదే. దాశరథి ఆ ప్రశంసను కూడా చేసాడు. కానీ, ఎక్కువగా 'పోతన' కవినే ప్రస్తావించి, తన ప్రత్యే కాభిమానాన్ని చాటాడు అతి నిరాడంబరంగా, కృషికి ప్రాధాన్యమిస్తూ, రైతు జీవితాన్ని గడిపిన కష్టజీవి, ఆత్మాభిమాని అయిన గొప్ప వ్యక్తి కాబట్టి పోతనను దాశరథి వరించి, అభిమానించాడని అనుకోవటం సమంజసం. అభిమానించటమే కాదు-

"నేను పోతన కవీశానుగంటములోని
ఒడుపుల కొన్నింటి బడసినాను"

అని సగర్వంగా చెప్పుకున్నాడు. కలాన్ని, హలాన్ని సమానంగా నడిపించిన పోతననే తన అభి మానిగా ఎన్నుకొన్న దాశరథి అభిరుచి- ఆయన అభ్యుదయ ధోరణిని మరింత బలపరుస్తుంది. అందుకే దాశరథి-

---

3. ఒకప్రదేశము; అక్కడ దుర్గ వున్నది.

"ఆతడు నేలదున్ని బ్రతు
కంతయు పస్తులు పన్న రైతుమా
పోతన యేమొ! వాని వడ
పోతలలో కవితా ప్రపంచ మా
పాత మనోహరమ్మయిన
పల్కుజగద్విదితమ్ము; వాని సం
గాతము నీకు కావ్యతను
కల్పన చేసిన దోయి; వాహినీ!"

అని అపాత మధురంగా, అభ్యుదయ భావ భరితంగా గానంచేసాడు.

"కోటి గొంతుకలు" అనే ఖండిక ఆంధ్ర రాష్ట్రావతరణానంతరం వ్రాయబడ్డది. పొట్టి శ్రీరాములు యొక్క అనన్యత్యాగఫలమే ఆంధ్ర రాష్ట్రావతరణ మనీ, అంతవరకు తలలువాల్చి యున్న తెలుగుప్రజలు రాష్ట్రావతరణంతో ఉన్నతోన్నత పర్వతాలో అనేట్లు తలలు పైకెత్తి విజయగర్వంతో జీవించ గలుగుతున్నారనీ చెపుతూ, ఎనిమిది మండలాలు ఏక కంఠంతో తెలుగు రాష్ట్రానికి దివ్వెలెత్తి మంగళారాత్రికమ్ముల పొంగి పోయెనని వర్ణించాడు. ఆంధ్రరాష్ట్రంవచ్చింది- ఇక మహాంధ్ర రాజ్యంవచ్చే సూచనలు కనిపిస్తున్నాయని ఆశాభావాన్ని వ్యక్తంచేసాడు ఈ శుభావసరాన్ని పురస్కరించుకొని-

"కృషికుల్ కార్మికులెల్ల రొక్కటిగ
సంగీతమ్ములంబాడుదురు
న్మిషితాంతః కరణమ్ములన్ తెలుగు
భూమింగూర్చి, ఆనందపున్
చషకమ్మెత్తుదు, స్వీయ రాష్ట్ర జనతా
సౌఖ్యార్థమై త్రావుడీ!
విషతుల్యంబగు భేదభావములు
పృథ్విన్ మాసి పోనిండహో!"

అని తనదివ్య సందేశాన్ని అందించాడు ఇందులో గాఢమైన దేశాభిమానము, మహాంధ్రోద్యమానికై మహత్తరమైన తపన స్ఫురిస్తున్నాయి.

"గుండెలో దీపాలు" అనే ఖండిక అద్భుతమైన భావచిత్రమాలిక. ఈ ఖండికలో ముఖ్యంగా స్నేహాన్ని ప్రేమని పెంపొందించుకోమనే ఉద్బోధ కనిపిస్తుంది. భరతమాత సేవకు అంకితమై, తమ సర్వస్వాన్ని త్యాగం చేసిన వీరులను కొనియాడుతూ, తన కావ్యామృతంతో చిరంజీవులను చేసాడు. గుండెలను పిండి ప్రమిదలనిండ స్నేహాన్నినింపి, ప్రేమాగ్ని కళికలను నిలిపి; చీకట్లను త్రాగి మత్తిల్లి జీర్ణకుటిలో గుర్రు పెట్టే జనాన్ని వెన్నుతట్టి మేలు కొలిపాడు.

"నవయువ రక్తనాళాల నడుమ పారు
నూత్న చైతన్య ధారయే నూనెగాగ
చీకటులు నింపుకొన్న మృత్స్నాకరండ
మీ ప్రపంచమ్ము నెల్ల వెల్గింతు నేను."

అని తన ధ్యేయాన్ని, అభ్యుదయ భావాన్ని వెల్లడించాడు.

''పూలలో జ్వాలలు" అనే ఖండికలో చల్లదనం, వెచ్చదనం రెండూ ప్రకృతి ధర్మాలు అనీ, అవసరాన్ని బట్టి చల్లదనం వెచ్చదనంగాను, వెచ్చదనం చల్లదనంగాను మారుతూవుంటాయనీ చెపుతూ-

"జ్వాల జ్వాలము పూవుగా చల్లపడును
పూవు పూవు జ్వాలా జిహ్వపోల్కి నెగయు
నాల్గు దిక్కుల వెచ్చంగనెమ్మె లెమ్ము!
నాల్గువాడల చల్లందనమ్మె సుమ్ము!"

అని ప్రకృతికి అన్వయించి చెప్పినప్పటికీ, ఇది మానవుడికి కూడా వర్తిస్తుంది. మానవుడు కూడా చల్లదనం లాంటి శాంతాన్ని, వెచ్చదనం లాంటి కోపాన్ని కలిగి వున్నాడనీ, అవసరాన్నిబట్టి ప్రవృత్తుల్లో మార్పువస్తూ వుంటుందనీ ధ్వని ప్రాయంగా సూచించటం గమనింపదగిన విశేషం.

"పౌష్యలక్ష్మి" అనే ఖండికలో సంప్రదాయధోరణిలో హేమంతఋతు ధర్మాలను రమణీయంగా వర్ణించి, ప్రకృతి చిత్రాన్ని గీచినప్పటికీ, అభ్యుదయ కవిగా తన ధ్యేయాన్ని విస్మరించలేదు.

"ముంగిళుల రంగవల్లికల్ మురిసి పోవ
భుగ భుగాయ మానమై భోగిమంట
లన్ని దిక్కుల వెలుగొంది అందగింప
వచ్చె సంక్రాంతి, మానవాళికి శాంతి".

అని విశ్వశాంతి దీపికలను వెలిగించాడు. మానవ మహోదయాన్ని ఆకాంక్షించాడు, ఈ విధంగానే "మధురరథము" అనే ఖండికలో కూడా ఉగాది పర్వ దినాన్ని, మధుమాస శోభలను మనోహరంగా వర్ణిస్తూనే, అభ్యుదయ ధోరణిలో-

ఆకురాలి దిగంబరమైన నాదు
శుష్కజీవన భూజమ్ము చుట్టు కొనగ
పూల పుట్టమ్ము లొసగిన పుణ్యమూర్తి
మాధవుడు, వనరాజ్య రమాధవుండు."

అని ఆశాభావాన్ని వ్యక్తం చేసాడు, శుష్కజీవితాల శుభోదయానికి హర్షించాడు, ఎండి, మోడై పోయిన చెట్లు మళ్ళీ చిగిర్చి, పుష్పించటం ప్రకృతి ధర్మం. అలాగే చితికి పోయిన జీవితాలు ఏదో ఒక నాటికి ఉత్సాహంతో, ఉవ్వెత్తున లేవటం కూడా కాలం ఇచ్చే తీర్పే ఈ తీర్పుకై ఓర్పుతో నిరీక్షించటం అవసరం, ఈ ఓర్పును నేర్పుతో మానవాళికి బోధించి, అలవాటు చేయటం అభ్యుదయ కవుల ధర్మం. తాను ఆశాభావాన్ని కలిగి వుండి, ఇతరులలో కూడా ఆశాభావాన్ని పెంపొందిస్తేనే, మానవాళి మనుగడ ముందుకు సాగుతుంది, ప్రగతి గమ్యాన్ని చేరగలుగుతుంది. మానవాళిని ప్రగతి గమ్యానికి చేర్చాలనే మహదాశయం దాశరథి ప్రతి అణువులోను ప్రవహిస్తుంది; అక్షరం అక్షరంలోను ప్రతి ధ్వనిస్తుంది.

"మాధురి" అనే ఖండికలో—
"ఆకు రాల్చెడి కారునే దరుగుదేర
రేపు వాసంత మధువు వర్షించకున్నె?"

అని భవిష్యత్తుపై అచంచలమైన విశ్వాసాన్ని ప్రకటించాడు. ఇంకా, మానవులు తరతరాల పాతబరువులు పడదోసి, మెడలుసాచి నడవటాన్ని, మంచు కరిగినట్లు మనసులు ద్రవించి, ప్రేమజలాలుగా స్రవించటాన్ని తలుచుకొని, అభ్యుదయానికి ఇవి ఆనవాళ్ళని ఆనందించాడు.

"రాగబంధము" అనే ఖండికకూడా ఉగాదికి సంబంధించినదే "ఆకురాలి గొంతులారిన తరువుల పూవు పూవు నాల్క పొల్కి పల్కె", అని ఎంతో భావ బంధురంగా వసంత ప్రభావాన్ని, ప్రాభవాన్ని చెపుతూ, మోడులచేత గొంతు ముళ్ళు విడిపోయేట్లుగా శాంత వసంత భాషను మాట్లాడించాడు. ఇది దాశరథి శాంతి ప్రియత్వాన్ని వెల్లడిస్తున్నది. కులమతాలు, భోగ భాగ్యాలు; కక్షలు-కార్పణ్యాలు, రాజ్యకాంక్షలు అన్నీ అబద్ధమనీ; రాగబంధ మొకటే నిజమైనదనీ అభివర్ణించి, ఆంధ్రమహా ప్రజాళి హృదయాలలో అనురాగ బంధం కలకాలం నిలిచి పోవాలని కోరుకున్నాడు.

కవిత లేక యున్న యువత శూన్యం బౌను,
యువత లేక యున్న నవత సున్న,
నవత లేక యున్న నాగరకత లేదు,
నాగరకత లేక నాడు లేదు."

అని దాశరథి విలక్షణమైన అభిప్రాయాన్ని వ్యక్తం చేసి, తన మహనీయ వ్యక్తిత్వాన్ని ప్రదర్శించాడు ఆయన ఆశించిన "నాడు" బహుముఖీనమైనది. కవిత, యువత, నవత, నాగరకతల సమ్మేళనమే ఆయన ఆశించినది, వీటన్నిటితో కూడుకున్న ప్రపంచమే స్వర్గతుల్యమైనదని ఆయన భావన.

శాంతి ప్రబోధాత్మకమైన కవితా ప్రపంచంలో దాశరథి "కపోతీ సందేశము" అనే కావ్యఖండిక అగ్రశ్రేణికి చెందినది, ఈ ఖండికలో హింసను, దానవాంశను నిరసించి; శాంతిని, మానవత్వాన్ని నెలకొల్పటానికి ప్రయత్నం చేయటం కనిపిస్తుంది. రణోన్మాదానికి, రక్తపాతానికి దాశరథి వ్యతిరేకి అనే విషయాన్ని ఈ ఖండిక నిరూపిస్తుంది.

ముక్కున శాంతి బీజములు
మోయుచు బోయి విశాల భూమి నల్
దిక్కుల చల్లి వచ్చితిమి
లెమ్మ, భయంపడబోకు; మప్పుడే
మొక్కలు లేచు చున్న, విక
ముందట కొమ్మలుసాచి పెద్దవై
చక్కని పూలు పూచి ఫల
సంతతితో పరిపుష్టమయ్యెడిన్.

అని 'కపోతి' ద్వారా లోకానికి శాంతి సందేశాన్ని అందించి, తన శాంతి కాముకత్వాన్ని వెల్లడించాడు, శాంతికి పావురాన్ని ప్రతీకగా గ్రహించే సంప్రదాయం మన కవులకు పాశ్చాత్య సంప్రదాయం నుంచే అలవడింది. తెల్లని పావురాన్ని "శాంతి కపోతము" అని సంభావించటం ప్రచురమైన విషయం.

బుద్ధుడు, క్రీస్తు, గాంధి-ఈ ముగ్గురు అహింసా మూర్తులు, శాంతి దూతలు. వీరి జీవితాలు లోక కల్యాణానికి, విశ్వ సౌభాగ్యానికి అంకితం చేయబడ్డాయి. ఈ త్రిమూర్తులను ఆదర్శంగా గ్రహించి, దాశరథి తన వ్యక్తిత్వంతో పాటు, కవిత్వాన్ని కూడా పునీతం చేసుకున్నాడు, గాంధీ మహాత్ముణ్ణి ప్రత్యేకంగా "క్షమా మూర్తి" అనే కావ్య కర్పూర నీరాజనంతో ఆరాధించాడు, భారతీయత కాయువుపట్టు,బుద్ధ దేవుని పర్యాయమూర్తి ఇత్యాది గుణరేఖలతో గాంధి మహితమూర్తిని చిత్రిస్తూ-

''అంటరాని వారలమని అలమటించు
పంచముల హరిజనులని పొంచ జన్య
మూది పలికిన హరిజనాభ్యుదయవాది
గాంధి మహనీయుడే లోక బాంధవుడు."

అని గాంధి దేవుని యొక్క లోక బాంధవత్వ సుగుణాన్ని అభివర్ణించాడు. లోక బాంధవుడంటే సూర్యనారాయణుడు, ముకుళించుకు పోయిన పద్మాలను వికసింప చేయటం, లోకానికి వెలుగు పంచటం ఆయన విశిష్ట ధర్మాలు, అలాగే గాంధి దేవుడు కూడా ముకుళించి పోయిన హృదయ పద్మాలను వికసింప చేయటం, మానవాళికి విజ్ఞానపు వెలుగులను ప్రసాదించటం అనే విలక్షణమైన ధర్మాలను కలిగివున్నాడు. అందుచేత దాశరథి అన్నట్లు గాంధి- "లోక బాంధవ" బిరుదానికి అర్హుడు. దేశభక్తి కవిత్వంలో, జాతీయ సంబంధమైన" గాంధి ప్రశస్తి కూడా ఒక విలక్షణమైన భాగమే.

"శౌర్య ప్రశస్తి" దేశభక్తి కవితా వృక్షానికి మరో ముఖ్యమైన శాఖ. ఈ ప్రశస్తిని కూడా దాశరథి తన కావ్యంలో ప్రవేశ పెట్టాడు.

"కాపయ నాయకుడు" అనే ఖండికలో-

"ఢిల్లి సులతాను కంఠ పీఠి పయి నీవు
కరకు కత్తి ప్రతిష్ఠింప గలిగినావు,
కాకతీయులనాటి విక్రమము మరల
సూపి తెలగాణ దాస్యమ్ము వాపినావు."

అని కాపయ నాయకుని శౌర్య పరాక్రమాలను కొనియాడి, చరిత్ర ప్రసిద్ధియైన వీర మూర్తిని చిత్రించాడు

"ముక్కలైన మాతృ మూర్తి గేహమ్మును
కూర్చి కట్టు డోయి కొమరు లార!
మనము మనము కలహమున మునింగిన యెడ
మన మహాంధ్ర లక్ష్మి మనకు రాదు."

ఇదీ దాశరథి దివ్య సందేశం. అంతః కలహాలు పనికి రావు. అంతరంగ బంధాలు- అనురాగ రాగాలు కావాలి. అప్పుడే మహాంధ్ర లక్ష్మి అవతరించటానికి అవకాశం వుంటుంది. అని ఐక్యతా సంగీతాన్ని వినిపించాడు.

ఏనాడెవ్వడు కత్తితో గెలుప లేదీ విశ్వమున్;
ప్రేమపాశానన్ కట్టుము నాలుగుం బది ప్రపంచాలన్
మహాత్ముండిదే జ్ఞానోద్బోధము సేసె;నెవ్వడు వినెన్?
సాహిత్య సామ్రాజ్యమం దైనన్ కొంతగ శాంతి పాదు
కొననిమ్మా! నీకు పుణ్యంబగున్"

అని "సాహితీ సామ్రాజ్యము" అనే ఖండికతో కావ్యాన్ని ముగించాడు. మహాత్ముడు చేసిన జ్ఞాన బోధను పెడ చెవిని పెట్టిన మానవాళిని తల్చుకొని దాశరథి చెందిన ఆవేదన అంతులేనిది. కనీసం కావ్యాల్లో నైనా ''శాంతి"ని బతికించాలనే సందేశాన్నిచ్చిన దాశరథి శాంతి ప్రియత్వం ఎంత మహత్తరమైనదో తెలుస్తుంది శాంతి లేకపోతే మానవ జాతికి మనుగడలేదు. అనే సత్యాన్ని గుర్తించి, లోకమంతా శాంతి పథంలో నడవాలని దాశరథి శుభాశంస! అందుకే ఆయన క్రాంతి కలాన్నీ, శాంతి ఖడ్గాన్నీ చేబూని కవన, కదన రంగాలలో దూకి స్వైర విహారం చేసాడు.

''మహాంధ్రోదయ గాధతో ఈ మహా కవి చరిత్ర ముడిపడి ఉంది. తిక్కన, శ్రీనాధుల తరువాత తెలుగు దేశాన్ని ఇంతగా ప్రేమించిన కవి లేడు.''4 అని ప్రశంస అందిన మహా కవి దాశరథి కవితా వ్యక్తిత్వానికి మణి దర్పణమైన ''మహాంధ్రోదయ" మహా కావ్యం తెలుగు వారి తరతరాల తపః ఫలం!!

---

4. ''కవితాల హరి'' (యువ భారతి ప్రచురణ): డా. జి. వి. సుబ్రహ్మణ్యం, పుట: 10ఠ.

అడ్రస్:-
డా॥ జి. బి, ఎన్. ఆచార్య, (తెలుగు లెక్చరర్)
ఓరుగంటి వారి తోట, దాసన్న పేట,
విజయనగరం— 2.

# "రమ్యాలోకము-పూర్వ కవుల ప్రభావము"

— సముద్రాల కృష్ణమాచార్య, ఎం.ఏ.

సాధారణముగా ఏ కవి అయినప్పటికిన్నీ ఒక కావ్యమును గాని, ఒక లక్షణ గ్రంథమును గాని లేక ఏదేని ఒక రచనంటూ చేసినట్లైతే ఆ రచన మీద పూర్వ కావ్యముల ప్రభావము తప్పని సరిగా పడుతుంది. ఈలాంటి ప్రభావము అధికంగా పడిన వారిలో రాయప్రోలు సుబ్బారావు గారు ఒకరుగా చెప్పవచ్చు. ఈయన ఆధునిక కవితకు ఆద్యుడు. ఈ ఆధునిక కవితను ఈయన అభినవ కవితగా నిర్ధారించి, నూతన పంథాలో, క్రొత్త పోకడలతో ఉత్కృష్టమైన రచనలు చేసినారు. ఈయనకు పూర్వమున్న రచనలు స్త్రీని కావ్య వస్తువుగా భావించి, పచ్చి శృంగారములో ముంచివేసి దాదాపుగా వ్రాయ బడినట్టివి. ఈలాంటి కవిత్వమును అసహ్యించుకొన్న వారై, మరొక వేపు తమ పిన్నిగారి చేతను మేల్కొల్పబడిన వారై[1] స్త్రీని ఒక ఉన్నత పీఠముపై అధివసించ చేసినారు. దాదాపుగా వారి రచన లన్నియు స్త్రీకి ఉన్నత స్థానము నిస్తూ వ్రాయబడినట్టివే. వ్యాస భారతములోని "ధృతి క్షమా దయా శౌచం కారుణ్యం వాగ నిష్ఠురా- మిత్రాణాం చానభిద్రోహః సప్తైతే సమిధః శ్రియః" అను శ్లోకమునకు వ్యాఖ్యాన ప్రాయంగా లలితాది కావ్యములు మొదలుకొని రూప నవనీతము[2] వరకు రచించినారు. ఈ పై వ్యాస శ్లోకములో స్త్రీకి చెప్పబడిన ఉన్నత గుణముల నొక్కొక్కటికి ఒక్కొక్క కావ్యాన్ని ఉదాహరణ ప్రాయంగా రచించిన వారు రాయప్రోలు సుబ్బారావుగారు ఇంకను ఈ వ్యాస శ్లోకమును వకుళ చేత[3] ధృతితోడ గృహంబు దిద్దవే... అని పాడింప చేశారు.

వారి రచనల ద్వారా ప్రభావితులైన విశ్వనాథ, కృష్ణశాస్త్రి, నాయని మొదలైన కవి శేఖరులు-కులపాలికా ప్రణయమని, స్వేచ్ఛా ప్రణయమని పలు మార్గముల పయనించిన వారై నూతన మార్గ స్రష్టలైనారు ఇందువల్లనే కావచ్చు, వారి 'అమలిన శృంగారం'[4] తరువాత ఎక్కువగా ప్రాచుర్యం పొంద లేక పోయింది. నూతన మార్గ స్రష్టలకు మార్గదర్శియైన అభినవ కవితా పితామహ రాయప్రోలు సుబ్బారావు గారి కృతులలోకి 'రమ్యాలోకము' ఒక విలక్షణ లక్షణ గ్రంథము. దీనిని వారు కావ్య ధోరణిలో రచించినారు. ఇందు ముఖ్యంగా వీరు తెల్పినవి కవితా సంబంధమైన భాష-ప్రకృతి-ప్రేమ యొక్క స్వచ్ఛత పృథ్వీ ప్రశంస మొదలైన విషయాలు. వీరు పూర్వాలంకారిక కావ్యాలన్నింటిని మథించినవారై, తర్కించి అందుండి నవ్యతను నూతన పదములతో క్రొత్త ఫక్కిలో రమ్యాలోకము ద్వారా మన కందించినారు. ఇందలి రచనా విధానము కూడ సులలితములైన పదముల కూర్పుచేత చదువువారిని మరి మరి చదివించే టట్టి రమ్యమైన, రసవంతమైన రచనా విధానముతో నడచినది. ఇందలి (రమ్యాలోకమందలి) పద్యములను చదివిన ప్రతిసారి పూర్వుల వెన్నో శ్లోకాలు-ఎన్నో ఆలంకారిక సూత్రాలు గుర్తుకు వస్తుంటవి. ఇవి భాషకు

1 కాకతీయ విశ్వవిద్యాలయ పరిశోధన పత్రిక విమర్శిని 4 లో నా తొలి రచన పు. 2 (1979)

2. నవోదయం వారిలో రాయప్రోలు సుబ్బారావు. పు. 35. 3. రూప నవనీతమ్. పు. 86.

4. విమర్శినిలో పు. 5.

భావనకు సంబంధించినట్టివి. ఈ లాంటి రమ్యాలోకము పైగల పూర్వకావ్య ప్రభావాన్ని తెలపడమే ప్రస్తుత వ్యాస రచనోద్దేశ్యము రాయప్రోలు, నన్నయ తెల్పిన నానారుచిరార్థ సూక్తినిధిని, జగన్నాథుని రమణీయార్థః ప్రతిపాదక శక్తిని తమలోకి జీర్ణించుకొన్నవారై ఈ కావ్యమునకు రమ్యాలోకమని సార్థక నామ నిర్దేశమొనర్చినారు. వీరి రమ్యాలోకమును మొట్టమొదట భాషా విషయకంగా పర్యాలోకించిన ట్లైతే-భాష శబ్దత్వము నొందుటను "శబ్దగుణక మాకాశమ్" అను ఉక్తిని పురస్కరించుకొని-

ఆకసంబున మొలచి అవ్యక్తనాద
భంగమయమయి శ్రుతియయి స్వరజటా క
లాపమై వర్ణమాలయై లలిత శబ్ద
మయిన భాషా జగత్కళ కంజలింతు

[రమ్యా-3] నంటాడు. ఇటు నాదముద్భవించడము, ఇది మార్పులు, చేర్పులు పొంది చివరకు లలిత శబ్ద స్వరూపమును సంతరించుకున్న విధానాన్ని స్పష్టంగా అలతి అలతి పదముల ద్వారా తెల్పి, తన విధిగా అంజలి ఘటించినాడు. ఇంకను సుప్రసన్న గారన్నట్లు 'రాయప్రోలు సుబ్బారావు గారు ప్రారంభించిన శబ్ద బ్రహ్మో పాసనమే నవ్యకవితకు ఒక దీప్తిని, ఒక వైలక్షణ్యాన్ని సాధించింది. తెలుగు కవిత్వ పరిధులను విస్తరింప చేసింది.[5] రాయప్రోలు వారు ఇంకొక చోట నన్నయ్య గారి అక్షర రమ్య మార్గమును, తిక్కన్నగారి వ్యంగ్య స్ఫోరక సునిశితోక్తులను పెంచి పెద్దవిచేసి తన రచనలో ప్రతిఫలింప చేస్తానని-

"నన్నయాక్షర రమ్య ప్రసన్నభణితి
సోమయాజి అర్థోన్ముక్త సునిశితోక్తి
పొదివి పోషింప. సర్వతో ముఖ వికాస
వర్ధనం బైన కావ్య సౌభాగ్యమెంతు" [రమ్యా + 1-2]

అను పద్యంలో స్ఫుటీకరించినారు. మరొకచో కళా పూర్ణోదయ కర్త చెప్పిన- 'పొసగ ముత్యపు సరుల్ పోహళించిన లీల దమలోన దొరయు శబ్దముల కూర్పు'[6] చేయాలనే భావము రమ్యా లోక-

'మృదుల సరళాక్షరముం సం మేళనమున
ఆర్ద్ర నవనీత మార్దవ మంది నడులు
శ్రవణ సుఖమిచ్చు సులలితోచ్చారణమున'' [రమ్యా 7-4]

అను పద్య పాదాల వల్ల గ్రాహ్య మౌతున్నది. అట్లాగే 'ప్రవాహనీ సదృశ యగును. దేశ భాష'। [రమ్యా-2-5] అను పద్య పాదానికి మూలం। 'ప్రవాహినీ దేశ్య' అనునది. ఇది నన్నయ కృత ఆంధ్ర శబ్ద చింతామణిలోనిది.

ఇంకొక చోట వామనుడు వాక్కొన్న- "అతీవ కవిభిః ప్రయుక్తం దేశ భాషా పదం ప్రయోజ్యం[7] అను వివరణను తమలోకి జీర్ణించుకొన్న సుబ్బారావు గారు అర్థానికి అవరోధం అవకుండా భాష్య విషయానికి భంగం వాటిల్ల కుండా సంధులు- విసంధులు సంస్కృత తెలుగు పదముల కలయికచే శ్రుతి సుఖ మొనరించ వచ్చునని-

'సుప్రసిద్ధ దేశ్యంబులన్ శుద్ధ సంస్కృ
తములతో కల్పదగు సం పదాయమనడె
వామనుడు? శ్రవణ సుఖంబు పాయదేని
అవి దళింతులే భంగిమ నాథునికులు' [రమ్యా. 7-7]

అను పద్యం ద్వారా ఉటంకించి నూతన సిద్ధాంత స్థాపన మొనర్చినారు

ఇక తెలుగు భాషా మతల్లి గొప్పతనాన్ని తెల్పుతూ "దేశ భాషలందు తెలుగులెస్స[8] అన్న కృష్ణదేవరాయల ఉక్తిని దృష్టిపథములో ఉంచుకొన్న రాయప్రోలువారు రమ్యా లోకములో-

"దేశ భాషా ప్రవాహ వీచికలలోన
తెలుగు రాయరంజిలు తేనెతొనుకువాడ" [రమ్యా. 1-3]

5. కాకతీయ పరిశోధన పత్రిక- విమర్శిని I. పు. 36. 6. కళా పూర్ణోదయము. ప్రథమ- 81.
7. కావ్యాలంకార సూత్ర వృత్తి. 8. ఆముక్త మాల్యద. 1-15.

అను పద్య ఉత్తరార్థంలో ఘోషించినారు. అలాగే -జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అన్న రామాయణోక్తిని-

ఈ యనంత చైతన్య బృంహితమయిన
జగత్తులో జన్మభూమి స్వర్గంబ యగును [రమ్యా1-5]

అను పద్యపూర్వార్థం ద్వారా విశదీకరించినారు. ఇంకొకచో- "ఎల్ల భాషలకు తల్లి సంస్కృతంబు" అను ప్రాచీనోక్తిని గ్రహించి-''సంస్కృతము తల్లి ఎల్ల భాషలకు నంద్రు ధాత్రియందు" [రమ్యా. 7-8] అని వ్రాక్కుచ్చినారు. సంస్కృతము మృత భాషయన్న మూఢుల మార్కొనుటకు రాయప్రోలువారు మాతృ భాషయైన సంస్కృతము-శాబక భాషయైన తెలుగు నకు తన సమస్త భాషాస్తనంధయముల నిచ్చి తాను కృశించినది. అంతేకాని సంస్కృత మెంత మాత్రముగా మాతృభాష కాదని నవ్వులైన తమకు సంస్కృత మందుగల స్వాభిమానమును మనవి చేసుకున్నారు. ఇంకొకచో ''సుప్రజాతంతుమ్ మావ్యవత్సీత్సాః" అను వేద వాగర్థమును.

''సుప్రజాతంత్ర నిర్వాహ సూత్రమగుట
తలచెదరు దంపతీ నిష్ఠ ధర్మ ము గ నె''
(రమ్యా 4-6)

అను పద్య ఉత్తరార్థంలో విశదీకరించినారు పై విధ దంపతీ నిష్ఠమైన శృంగారము మలీమసమైంది కాదు. బృహదారణ్యకోపనిషత్తుకూడ దంపతీనిష్ఠమైన రతిని యజ్ఞంగా పేర్కొన్నది.

"నేవియోగ మాధుర్య లీలా విపాక
మనుభవింప నక్షాదెద" [రమ్యా. 4-7 నన్న వాక్కు జగన్నాధరాయల "మూఢాః సంభోగ మిచ్ఛంతి" అన్నశ్లోక భావమేనని.

ఇంకను -"చిన్న నివ్వరి సిగవలె సన్నగాత
శుక్కుమన్న నాత్మకల జూచెనొక్క దృష్టి"
[రమ్యా 4-12]

యన్నది. "నీవార శూకవత్ తన్వీ పీతా భాస్వ స్త్వణూపమా" అను ఋగ్వేదములోని సూక్తమును స్ఫురింపచేయు చున్నదని నారాయణరెడ్డి గారు[9] తెల్పియున్నారు.

-ఇక రమ్యాలోక ప్రారంభమును చూచినట్లైతే-

''మామిడి కొమ్మ మీద కలమంత్ర పరాయణుడైన కోకిల స్వామికి మ్రొక్కి ఈయభినవ స్వర కల్పన కుద్యమించితిన్! [రమ్యా 1] అన్నశ్లోకము కాన నగును. ఇది ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశోవాఽపి తన్ముఖమ్" అన్న ఆరోగ్యోక్తిని దృష్టియందుంచుకొని నమస్క్రియా రూపమైన వాల్మీకి ధ్యానము చేయబడి నట్లుగా చెప్పవచ్చును. ఈపై పద్యములోని 'కోకిల స్వామి' అన్నపదము-

"కూజంతమ్ రామ రామేతి మధురం మధురాక్షరం ఆరుహ్యకవితా శాఖాంవందే వాల్మీకి కోకిలమ్" అన్న రామాయణ శ్లోకమును జ్ఞప్తికి, దెచ్చుచున్నది. ఈ రామాయణ శ్లోకంలో వాల్మీకి కోకిలగా చెప్పబడగా సుబ్బారావుగారు మాత్రం 'కోకిల స్వామికి'గా వాల్మీకిని స్తుతించినారు ఈ స్తుతించుటలో ఒక నిగూఢమైన అభిమానము వెల్లడి యగుచున్నది. అదే మంటే తాను (రాయప్రోలు) అభినవ కవితను కూర్చు చున్నందున వాల్మీకిని భావ కవితా ప్రస్థానానికి ప్రప్రథమాచార్యులుగా భావించి, పూజించి- "మధు మయ ఫణితీనాం మార్గదర్శీ మహర్షిః" అని భోజుడు వాల్మీకిని స్తుతించినట్లు స్తుతించి, తాను కూడ మృదు మధురమైన పద సంఘటితత్వము చేత ఒకానొక విలక్షణమైన రచనలో పద్యముల కూర్చుదునన్న అభిప్రాయము వెల్లడియగుచున్నది. ఇంకొక పక్షంగా విలోకించినట్లైతే రామానుజారావు పేర్కొన్న[10] విధంగా సుబ్బారావుగారికి ప్రకృతి యెడల అను రాగము, మమకారము, పూజ్యభావము, ఆ ప్రకృతి. కతన కలుగు పులకాంకితము వెల్లడియగుచున్నది.

9. డా. సి.నారాయణరెడ్డి ఆధునిక కవిత్వము సంప్రదాయము. ద్వితీయ ముద్రణ పు. 267.
* భోజచంపు- 10. సారస్వత నవనీతము. పు. 126.

ఈ ఆనందమును తమ రచనలు కూడ ఇచ్చునను భావము విస్పష్టమగుచున్నది.

పూర్వ కాలంలో కావ్య పఠన మనావశ్యకమని, కావ్య పఠనమువల్ల చెడిపోదురని అందువల్ల "కావ్యాలాపాంశ్చ వర్జయేత్'' అని ప్రబంధ ప్రాచీన ఉక్తిని పఠనము చేయుటకై సత్యం శివం సుందరమైనది భగవత్స్వరూపము, మరియు కవికృత కావ్యమే + అనియు తమ రమ్యాలోకములో నొక్కి వక్కాణించినారు. వేరొకచో-మమ్మటుడు వెలిబుచ్చిన-"నియతి కృత నియమరహితాం హ్లాదైకమయీం అనన్యపరతంత్రాం నవరస రుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవేర్జయతు"[11] అను శ్లోకభావమును-

వాసనా కర్మనియతమౌ బ్రహ్మ సృష్టి
నంద చందాలు సామాన్య మగుట కాదె
ఇష్టరస రాగ భావనోద్దిష్టముగను
కవిసృజించె హ్లాదైక వాఙ్మయ జగంబు''
[రమ్యా. 8]

అను పద్యంలో తేటతెల్ల పరచినారు. కవి వాఙ్మయ జగంబును తాను భోగియైనచో శృంగార రసవంతముగా- యోగియైనచో విరాగమైనదిగా సృజించునని, బ్రహ్మ సృష్టికి-కవి బ్రహ్మ సృష్టికి గల వ్యత్యాసమును పై పద్యంలో హృద్యంగా తీర్చినారు.

"క్రౌంచ మిథునానురాగ దారణమువలని
శోకమే శ్లోకమయి ఏ మృదూకృతాత్మ
ముఖ వియత్పథమున గంగబోలె వెడలె
ఆ వచస్వి ప్రాచేతసు నాత్మదలతు॥[రమ్యా. 9]

అను పద్యంలో మరొకమారు వాల్మీకి మహర్షిని స్మరిస్తూ-

"మానిషాదః ప్రతిష్ఠాంత్వం అగమః శాశ్వతీస్సమాః
యత్క్రౌంచ మిథునాదేకం అవధీః కామమోహితం॥

అను శ్లోక భావమును గుప్పించి. తాను ముందు, ముందు కరుణరసమునే ప్రధానముగా పేర్కొంటాననెడి విషయాన్ని సూచిస్తూ, తమకు కరుణరసము నందుగల ఇచ్చను-ప్రీతిని-అభిమతమును వెలార్చినారనికూడ చెప్ప వచ్చును.

-ఇక-"రౌచికుండయిన కవి రుచిర ప్రసన్న
పద మృదూప గూహన శయ్య బన్నగలడు
పద్య మందు గేయచ్ఛాయ; ప్రౌఢమయిన
కృతి అసాధ్యమగు స్వరోద్గీతియందు"
(రమ్యా. 2-13)

అను పద్యంలో- "యాపదానాం అన్యోన్యమైత్రీ శయ్యేతి కథ్యతే'' అను విద్యానాథుడి భావాన్ని వివరిస్తూ, పై లక్షణములలో రచన చేయు వారినే తాను కవిగా భావింతునని, తాను కూడ పై విధ రచననే వెలార్చెదనని రాయప్రోలు వ్యక్తము చేసినారు. అప్పకవి కూడ "మృదు మధురోక్తి వెదకి కావ్యంబెల్ల రచియించు పదపడి రౌచికుండు[12] అని రౌచికుని లక్షణాన్ని స్పష్టంచేసి యున్నాడు అలాగే "రామణీయక మాకర్ష్య రమ్య రచన (రమ్యా. 3-6) అను పద్య పాదం ద్వారా జగన్నాధుడి- "రమణీయార్థః ప్రతిపాదక శబ్దః కావ్యమ్[13] అను ఉద్దేశ్యమును బలపరచినారు. తదుపరి 'శృంగార ఏవ ఏకోరసః[14] అన్న భోజోక్తిని, "ఏకోరసః కరుణ ఏవ"[15] అన్న భవభూతి భాష్యమును దర్శించిన సుబ్బారావు గారు-"

"కరుణ శృంగారములు రెండె కావ్యమందు
నిజరస విపాక భోగ మందించ గలవు;
సహజ పూర్ణ చిన్మయ సుఖా స్వాదనమున
శోక మథిత మనో దోష శుద్ధి వలన" [రమ్యా. 4-9]

---

+ రమ్యాలోకము 7. 11. కావ్య ప్రకాశము, ప్రథమోల్లాసము, మమ్మటుడు.
12. అప్పకవీయము, ప్రథమ-47. 13. రస గంగాధరము- ప్రథమాననము.
14. సరస్వతీ కంఠాభరణము. 15. ఉత్తర రామచరిత్రలో తమస యను నదీ దేవత చేత అనిపించి నట్టిది

అను పద్యం ద్వారా మానవ జీవితంలో ఎదురయ్యే రెండు రసముల అస్తిత్వమును స్పష్టము చేస్తూ, సమన్వయ దృష్టిని (ఈ రెండు రసముల వివేచనలో) అవలంబించినాడు. ఇటు ఈ రస సిద్ధాంతాన్ని స్థాపించుటకు కారణాన్ని సుప్రసన్న గారు- "సుఖ దుఃఖానుభవ ద్వివిధమైన జగత్తులో మూల రసము కూడ ద్వివిధముగానే రాయప్రోలు భావించడం జర్గింది"[16] అని తెల్పియున్నారు. ఇంకొకచో- భవభూతి ఉత్తర రామ చరిత్ర ప్రారంభ శ్లోకంలోని ''ఆత్మ కళను" రాయప్రోలు వారు-

"ప్రాణియంతః కరణ వృత్తి భావ మయమొ
నర్చి మృదు లీకరించు ఆనంద కళలు'' [రమ్యా. 6-4]గా వక్కాణించినారు.

మరొక చోట- ''అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే॥[17] అన్న ఆనంద వర్ధనుని శ్లోక భావాన్ని-

"హృద్యమై రసమయమైన ఈయపార కావ్య
సంసారమందు సుకవి యొకండె బ్రహ్మ;
ఏతదభీష్టిధారాతరంగితముగ
అను రణించు సుమి శబ్ద ప్రవృత్తి॥ [రమ్యా. 7-1]

అను పద్యంలో హృద్యంగా విషయాన్ని స్పష్టము చేసినారు.

ఆనాడు తన నవ్య కావ్యములపై ప్రబలిన విమర్శలను ఎదుర్కొని మహాకవి కాళిదాసు తన మాళవికాగ్ని మిత్ర నాటక ప్రస్తావనలో- "పురాణమిత్యేవ నసాధు సర్వం. నచాఽపి కావ్యం నవ మిత్య వద్యమ్ సంతః పరీక్షాన్యతరద్భజంతే మూఢః పర ప్రత్యయ నేయ బుద్ధిః॥ అని సమాధాన మిచ్చిగా దాని భావాన్ని రాయప్రోలు వారు-

''ప్రాత కలిగిన మాత్రాన భవ్యములు కావు
నవ్యమైన మాత్రాన నింద్యములు కావు
అంద చందము లభిరుచి ననుసరించు
దేశ కాల పాత్రాను వర్తితములగుట" [రమ్యా.7-17]

అను పద్యంలో వివరించి, తాను కూడ కాళిదాసు వలె రచనలో క్రొత్త ప్రక్రియ చేపట్టుదునని, వానిపైన కూడ పలు విమర్శలు రావచ్చునని ముందుగానే సూచన చేయుట గమనించదగినది. ఈ భావాన్నే మరొక విధముగా తెల్పుట గమనించదగినది. అదేమంటే ''ప్రాతవయినంతనే త్యజింపరు, నవీన
మయిన మాత్ర వరింపరు; ప్రియములై స
హృదయ సేవ్య మానములైన వెల్ల స్వీక
రించి భావాంబర మలంకరింతురర్థి" [రమ్యా. 714]

ఇంకొకచో శాకుంతల మందలి- "రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్ పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః।
తచ్చేతసా స్మరతి నూన మబోధ పూర్వమ్
భావస్థిరాణి జననాంతర సౌహృదాని॥ అనుశ్లోక భావమును-"రమ్య చిత్రముల్ గని, మధుర ప్రసన్న
సూక్తులాలించి, ప్రాణి ఔత్సుక్య మందు;
తడుప లాలనార్ద్రమగు చేతమ్మునందు
స్మరణ కెక్కు జన్మాంతర సౌహృదములు
(రమ్యా. 1-8)

అను పద్యములో గుప్పించినారు. ఇట శాకుంతల పద్యాన్ని అనుసరించటంలో గల ప్రయోజనాన్ని సంపత్కుమారగారు ఇలా పేర్కొన్నారు-'శాకుంతల పద్యాన్ని అనుసరించటంలో ఇక్కడ ఒక ప్రయోజన ముద్దిష్టమయింది. రమ్యములయినవే మధురములయినవే జీవున్ని పర్యుత్సుకుణ్ణి చేసి జన్మాంతర సౌహృదాలను స్మరణకు తెస్తయి. అందువల్ల రమ్యతయే కావ్యంలో ప్రధానంగా ఉపాధేయమయినదని చెప్ప

16. విమర్శిని I- పుట 24. 17. ధ్వన్యాలోకము- III.

డానికి ఉపస్కారకంగా కాళిదాసు భావం స్మరించ బడింది. రమ్యత మాత్రమే ఉపాదేయం కావటంవల్ల హేయములు, క్లీబములు, జుగుప్సాయుతములు రమ్యములు గామి, గ్రాహ్యములు కావని వెనువెంటనే చెప్ప బడింది. భావం రమ్యమే అయినా, రచన రమ్యం కాకుంటే ధూమ ధూషిత దుర్గంధ ధామవసతిలో రామ చిలుక కాకి అయినట్లు కావ్యగత మధుర భావనకు ఉద్దీప్తి కలుగదని, దీప్తిమాయునని చెప్పబడింది కాగా రసాను కూలములయి రమ్యంగా రచన ఉండాలనీ, అట్లాంటి రమ్య రచనగల కావ్య రక్తి హృదయ మానందధారణ రమించు ననీ రమ్యాలోకం నిశ్చయించింది[18] ఈ విధంగా వారి వ్యాఖానం విపులంగా సాగింది.

ఇక పోతే ఇంకొక చోట– "ఇష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ కావ్యమ్-"[19] అన్నదండి వాక్యాన్నిట-"రుచి మదిష్టార్థదోహన ప్రచుర శబ్ద సరమునేకావ్యమనియె దండి" [రమ్యా 10-18]

అని ఇలాంటి పదముల కూర్పే" చిత్తశోభాపిపాస నార్చు" [0-16] ననియు వివరించారు. మరొకచోట- "ప్రజ్ఞానవనోన్మేషశాలినీ ప్రతిభా" అన్న ఆర్యోక్తిని పురస్కరించుకొని సుబ్బారావు గారు- "కవిపచో వైఖరియు, రసజ్ఞ ప్రసాద నవ నవ స్ఫురణము ప్రమాణంబులందు" [రమ్యా 11-1]

అను పద్యపాదముల ద్వారా వ్యక్తం చేసినారు. పలుమార్లు పఠించినా పదే పదే పఠింప చేయు ప్రబంధ (కావ్య) ప్రయోగమే ప్రతిభయని వారి అభిమతము.

"నయతి ఇతి వృత్తం ఫలంచ ప్రాప్నోతీతి నాయకః" అని పూర్వ లాక్షణికులు తెల్పగా, రాయప్రోలు వారు తమ రమ్యా లోకంలో- స్త్రీయే ద్విధా అంటే యౌవన త్యాగము చేతను, ప్రేమార్చనమువలనను ఆనందోన్ముఖురాలైనందు వల్ల నాయికయే సమగ్ర చరితార్థి. ఈమె చివరకు ఫలమును పొందుతుంది అని తమ రచనల ద్వారా చెప్పక చెప్పినారు. ఇట్లు వారికి స్త్రీలయందు గల గౌరవము, అభిమానము కూడ స్పష్టమవుతున్నది,

ఈవిధంగా రాయప్రోలు సుబ్బారావుగారు గణపతి శాస్త్రి[20] గారన్నట్లు-"గురజాడ ఆధునిక కవితా ప్రస్థానంలో దేశి మార్గానికి ప్రథమాచార్యుడైతే రాయప్రోలు వారు ఆధునిక కవిత్వంలో- మార్గ కవితా ప్రస్థానానికి ఆద్యులయినారు. ఈయన తమ కవితలో- ఆంధ్ర కావ్యాలలో అనూచానంగా వస్తున్న కావ్య భాష పరిహరించ లేదు. నన్నయ కాలం నుంచీ అవిరళంగా ప్రవహిస్తున్న తెలుగు భాష ఈయనలో ఒక నూతన కవితా ప్రవాహంగా మారి నవ్య మార్గ కవితకు మంగళ ప్రబోధ 'గీతికగా వెలిసింది. వారి సిద్ధాంతంలో కవి విరాగి కాడు. పంచ భూతాత్మకమైన ప్రకృతి అతని ఉపాస్య దేవత.

ఈ విధంగా సుబ్బారావుగారు పూర్వలాక్షణికుల సిద్ధాంతములను తమలోకి బాగుగా జీర్ణింప చేసుకొని. పునః పునః పలుమారులు పలురీతుల మననం చేసికొని వివేచించి, విలోకించి- విస్తృతంగా, విస్పష్టంగా బోధపడేందుకు రమ్యమైన పంథాలో, లలితమైన పదముల కూర్పుతో. స్పష్టంగా స్ఫుటంగా తెల్లమగునట్లుగా అభినవ కవితయను పేరుతో "రమ్యాలోకమ" ని పేరిడి, శాస్త్ర గ్రంథమైన దానిని కావ్య పద్ధతితో తమపైనపడిన పలువురు లాక్షణికుల, కవుల ప్రభావముతో (రమ్యాలోకమును) రచించి, ఒకానొక నూతన ప్రక్రియకు ప్రథమాచార్యులై, అభినవ కవితా పితామహులైనారని ఘంటా పథంగా నొక్కి వక్కాణించ వచ్చు.

---

సముద్రాల కృష్ణమాచార్య ఎం.ఏ.,
ఇ. నెం. 10-4-1, గిర్మాజిపేట్,
వరంగల్-500002.

---

18. ఆంధ్రప్రదేశ్ - మార్చి 1974 లో 'రాయప్రోలు వారి రమ్యాలోకము' పుట- 47.

19. కావ్యాదర్శము- ప్రథమ పరిచ్ఛేదము 10.

20. రాయప్రోలు సుబ్బారావు గారి కవిత. పి. గణపతిశాస్త్రి, భారతి, డిసెంబరు 1952- పు. 589.

# తులసీదాసు-వినయ ప

—పి. వి. ఎల్. సుబ్బారావు

హిందీ సాహిత్యంలో రామాయణం పేరు తలిస్తే తులసీదాసు, తులసీదాసు పేరు స్మరిస్తే అతని రామాయణము ప్రతి వారి కన్నుల ముందుకి వస్తాయి. "రామచరిత మానస్" లో తులసీదాసు పవిత్ర స్వరూపము మనకుసాక్షాత్కరించినప్పటికి భక్తితో తన్మయం చెందిన తులసీదాసు ఆకృతి మనకు అతని యొక్క మరొక కృతిలో అగుపిస్తుంది. అయితే ఆ కృతికి జనావళిలో అంతగా ప్రాముఖ్యం లభించలేదు. అయినప్పటికీ అది భక్త జనావళికి పరమ ప్రియమైనది, జ్ఞానులకు సిద్ధాంతమంజూష పండితులకు పాండిత్యనికష, యోగులకు సమాధి స్థలి, అదియే వినయ పత్రిక.

కలియుగ కఠోర కష్టాలకు తాళలేక తులసీదాసు తన ప్రభువు, త్రిలోకాధీశుడు అయిన శ్రీరామచంద్రుని దర్బారులోనికి పంపుకున్న వినతి పత్రమే ఈ వినయ పత్రిక. ఇచ్చట తులసీదాసు ఒక వ్యక్తిగా కాక మానవ జాతికి ప్రతినిధిగా కనబడతాడు. కఠిన శిలలనుండి కూడా కన్నీరు ప్రవహింప చేసేటంత దయనీయంగా ఇది రచింపబడింది. మానవుని యొక్క అశక్తత, దైన్యత్వము, అల్పత్వము, స్వామి యొక్క సామర్థ్యము, మహాత్మ్యములను గూర్చిన ఉక్తులతో వినయపత్రిక అభివ్యక్తీకరింపబడింది. ప్రతిభ, అర్థగాంభీర్యము, అనుపమ ఉక్తి చమత్కారము, శబ్దలాలిత్యము, అనురాగ మాధుర్యములతో మేళవించిన ఈ గ్రంథము తులసీదాసు యొక్క నిర్మలమైన ఆత్మను అద్దంలా పట్టి చూపుతున్నదని చెప్ప వచ్చు.

ఈ గ్రంథము జనబాహుళ్యములోనికి చొరబడకుండా ఉండడానికి కారణము-ఇందులో చర్చింపబడిన విషయము, పోషింపబడిన రసము అర్థం చేసికో గలిగినవారు, అస్వాదించ గలిగేవారు వేళ్ళమీద లెక్కింపబడిన వారు మాత్రమే. దీనిలో నిండి ఉన్న ప్రకాశాన్ని వీక్షించే నేత్రాలు లక్షల్లోనో, కోట్లల్లోనో ఏ ఒక్కరికో ఉంటాయి.

పేరులో వినయ పత్రిక ఉద్దేశ్యము స్పష్టమవుతున్నది. రాజ దర్బారులోనికి అడుగు పెట్టే శక్తి సామాన్యులకు ఉండదు. అందువలన తులసీదాసు మొదట దేవుళ్ళను-దేవతలను స్తుతించి అర్జీ రాముడికి అందించమని మొరపెట్టుకున్నాడు. పుస్తక ప్రారంభం గణపతిస్తుతితో మొదలవుతుంది. తరువాత సూర్య, శివ, భైరవస్తుతి అయిన తర్వాత పార్వతి, గంగ, యమున స్తుతి్వకాశి, చిత్రకూట వైభవ వర్ణన కావింపబడుతుంది, తరువాత హనుమాన్‌స్తుతి ఆరంభం. ఒక విధంగా హనుమంతుడు తులసీ వకీలు అని చెప్పవచ్చు. తరువాత లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల స్తుతి, దీనితో దర్బారులోని వారందరిని స్తుతి కావించిన తరువాత చివరిగా శ్రీరాముడితో తనమాట విన్నవించమని జానకీ దేవిని-

కబహుక అంబ, అవసర పాఈ।
మెరియో సుధి ద్యాయిబీ కఛు కరున-కథాచూఈ॥

(సమయం కనిపెట్టి, నీ పతి దృష్టినాపై మరలేటట్లు అయనతో కరుణారసభరితమైన ఓ కథ చెప్పమ్మా, సీతమ్మా).

అని ప్రార్థించడంలో తులసీదాసు భవభూతి కంఠంతో కంఠం కలిపి కరుణరసాన్ని పలికిస్తున్నాడేమో అనిపిస్తుంది. 42, 43 పదాలలో సంక్షిప్తరామ చరిత్ర. 45లో మరల రామవందన, 48లో కృష్ణ వందన ఈ విధంగా వందనములు అయిన తరువాత వినయ పత్రిక వాస్తవరూపం బయట పడుతుంది. కొంత మంది పాఠకులు ప్రారంభంలో ఉన్న ఈ క్లిష్ట పదాలను చూసి దూరంగా పోయి వినయాస్వాదనకు విముఖులవుతారు. ఈ జీవి ఆ పరమేశ్వరుని యెదుట దైన్యాన్ని, దుఃఖాన్ని, అసమర్థతను ఎలా విన్నవించు కుంటాడో ఎక్కడికక్కడ గోస్వామి చక్కగా తెలియ పరిచాడు. ఒక పదంలో రాముడి ప్రభుత ఉంటే మరొక దానిలో అతని సౌందర్యము, ఔదార్యము, శీలము వర్ణింపబడింది. కొన్ని పదాలలో పీడిత మానవ జాతి ప్రతినిధిగా కనబడతాడు. ఈ విధంగా వినయ పత్రికలో 279పదాలు ఉన్నాయి.

సరే, వినయ పత్రిక తయారయింది. దీన్ని ఆ రాముడికి అందించే వారెవ్వరు? అందరిలోకి లక్ష్మణుడు సరిఅయినవాడుగా కన్పించాడు. ఎందుకంటే రాముడికి అతని మీద అధికమైన వాత్సల్యం. అందువలన లక్ష్మణుడే దానిని ప్రవేశ పెడతాడు. దీనితో గ్రంథం పూర్తి అవుతుంది.

"ముదిత మాథ నావత బనీ తులసీ అనాథకీ
పరీ రఘునాథ హాథ సహీ హై॥"

(అనాథుడైన ఈ తులసీ రచించిన వినయ పత్రిక మీద ఆ రఘునాథుని ఆమోద ముద్ర పడింది. నా అభీష్టము నెరవేరినందుకు ప్రణమిల్లుతున్నాను) అని తులసీ పూర్తి చేస్తాడు.

భక్తి రసమును సంపూర్ణంగా ఆస్వాదించాలంటే వినయ పత్రికలో తప్ప మరెక్కడా అవకాశము లేదు. భక్తికి తన ఆరాధ్య దైవము యొక్క అనుభవము పరమ ఆవశ్యకమైన విషయము. తులసీ కలం ద్వారా ఈ రెండు ధారలు నిర్మలమైన శబ్దాల రూపంలో వెలువడ్డాయి. వీనిని అవగాహన చేసికొంటే మనస్సుకు ఉన్న మైల తొలగి పోవడమేకాక పవిత్రత కూడా చేకూరుతుంది. తులసీ భక్తిలో "శీలం, శక్తి, సౌంద ర్యం" అనే మూడింటికీ ప్రాధాన్యము ఉండడం వల్ల మానవుని సంపూర్ణమైన రాగాత్మక ప్రవృత్తి పరిష్కా రానికి, ప్రసారానికి వీలు కుదిరింది. ఇహలోక బంధ నాల నుండి వైదొలగి ఆత్మ సాక్షాత్కారము పొందా లనుకొనే వారు కామక్రోధాల నుండి దూరంగా ఉండ డానికి మార్గాలు ఎలా అన్వేషిస్తారో, అదే విధంగా లోక బంధనాలలో నిమగ్నులై ఉన్నవారు తమ బాధ్యతల మధ్యనే ఆనందపు జ్యోతి వెలిగించుకుం టారు. ఆ ప్రకాశంలో జీవితం యొక్క దివ్య ప్రకాశం కాంచుతారు. అటువంటి మానవుల యొక్క వచన ములు, భావముల వలన లోక కల్యాణము సిద్ధిస్తుంది. వారి రచనలలో భగవానుడు లోక నిమిత్తము చేసే కార్యాలు కన్పిస్తాయి.

ఈ ప్రాచీన భక్తి మార్గము ఒక దేశమును కాని, ఒక విభాగమును కానీ ఆధారం చేసికొని నిలబడి లేదు. ఈ విధానం మనలను వ్రతాలు, ఉపవాసాలు చేసే వాళ్ళమీద కాని, వారి ఉపదేశాల మీద కాని శ్రద్ధ కనపరచ మని బలవంతము చేయదు. అంతేకాక ప్రపంచంలోని భోగాలను అనుభవిస్తూ తమ భుజ బలంతో రణరంగంలో అత్యాచారాలను అణిచే వారిపై కాని (లేక) తమ అంతరిక దృష్టి, సాధన బలంతో మానవ జాతి జ్ఞానాన్ని వృద్ధి పరిచే వాళ్ళ మీద కాని ఉదాసీనత కనపరచమని కూడా చెప్పదు. తులసీ రామ భక్తి అనే పదార్థం వల్ల జీవితంలో శక్తి, సర సత, ప్రఫుల్లత, పవిత్రత అన్ని లభిస్తాయి. భక్తి యొక్క విధానాలు, భక్తి వలన అంతఃకరణ యందు కలిగే శుభలక్షణాలు అన్ని వినయ పత్రికలో వివ రంగా ఉన్నాయి.

తులసీ వంటి వాళ్ళని మనము కేవలం ఉపదేశ కులుగా భావించ కూడదు, తమ భావుకత, ప్రతిభ

మేళవించి లోకానికి ఒక ఆదర్శ రూపం అందించే వాళ్ళుగా గుర్తించాలి. లోక వ్యవహారంలో మగ్న మయి ఉండే అవతారాలు ఏమంగళ జ్యోతిని వెలిగించాయో ఆ ప్రకాశాన్ని అనేక రూపాల్లో సందర్శించి ముగ్ధులగుట, ఇతరులను ముగ్ధులను చేయుట ఇటు వంటి భక్త కవుల లక్షణము, లక్ష్యము. ఉపదేశాల ప్రభావము పైపైననే ఉంటుంది. అవి హృదయపు లోతులకు చేరలేవు. అందు వల్ల హృదయం వాటికేసి తలెత్తి చూడనైనా చూడదు. బుద్ధి వానిని తీసికొని వివాదాలకు దారి తీస్తుంది వాదం కాని, తర్కం కాని తులసీ ఉద్దేశ్యంలో కేవలం "వాక్య జ్ఞానం" మాత్రమే. దీనివల్ల జీవ కల్యాణం పూర్తి కాదు.

వాక్య జ్ఞాన అత్యంత నిపుణ భవ-పార న పావై కోఈనిసి గృహ దీపకీ బాతిన్హ, తమ నివృత నహి వాఈ" (వాక్య జ్ఞానంలో ఎంత కుశలుడు అయిన వ్యక్తి అయినా భవసాగరాన్ని దాటలేడు. ఎందుకంటే ఆత్మగతమైన అనుభూతి లేకుండా కేవలం "సో అహం" "సో అహం" అనటం వల్ల ముక్తి రాదు, లేదు. చీకటి ఇంటిలో దీపం గూర్చి మాటలు చెప్పు కుంటూ ఉంటే వెలుగు వస్తుందా? అంధకారం దూరం అవుతుందా? అంధకారం పోవాలంటే దీపం వెలిగించాలి. ముక్తి కావాలంటే ఆత్మకి అనుభూతి కలిగించాలి.)

వాక్య జ్ఞానం వేరు, అనుభూతి వేరు. ఇందువలననే ప్రాచీన కాలానికి చెందిన భక్తులు ఉపదేశాలు, వాదాలు, తర్కాల కన్న భగవంతుని లీలల శ్రవణం, భగవంతుని కీర్తించడం వీటికి అధిక ప్రాముఖ్యం ఇచ్చారు.

ప్రాచీన భాగవత సంప్రదాయంలో కూడా భగవంతుని యొక్క-లోక రంజక రూపం ప్రతిష్ఠింప బడింది. దాన్ని ఆధారం చేసికొంటే మానవ హృదయంలో చెలరేగే భావ సంఘర్షణ కల్యాణ మార్గం వైపు తనంతట తాను నడుస్తుంది. దీన్ని ప్రత్యక్షం చేయడమే తులసీ వంటి భక్త కవుల లక్షణము. కేవలం ఉపదేశం ఇచ్చి ఊరుకోవడం కాదు.

తులసీ అనంత సౌందర్యాన్ని సాక్షాత్కరింప చేసికొని దానిలోనే అనంత శక్తి, అనంత శీలాన్ని కాంచ గలిగినాడు. అనంతశక్తి, అనంత సౌందర్య సమన్వితమైన శీలాన్ని ప్రతిష్ఠించడంలో తులసీ ఆశ ఏమిటంటే ఆవెలుగులో మానవ హృదయం తప్పక ద్రవీభూతం చెందుతుందని.

"సుని సీతాపతి, సీల సభావు
మోద నమన, తన పులక, నయన జల సో నర
ఖేహర ఖావు"

ఈ విధంగా హృదయాన్ని స్పందించే పద్ధతిలోనే మానవునిలో శీలము, సంస్కారము పెంపొందించాలి. దీనికి మరేపద్ధతిలేదు. "హరి భక్తి" అవసర మేమిటి? అన్న ప్రశ్న మనకు వస్తుంది. దీనికి సమాధానం ఏమిటంటే మానవుడు శాంతి కాముకుడు. ఈ శాంతి మనస్సుకు సంబంధించిన విషయం. మనస్సును పవిత్రంగా చేసికొని నిగ్రహంగా ఉంచినట్లయితే శాంతి లభిస్తుంది. కాని మనస్సును పవిత్రంగాను, నిగ్రహంగాను ఉంచడం తేలికయిన పనికాదు. దీని కోసం అనేక సాధనాలు చెప్పబడ్డాయి. కాని

"జప తప తీరథ జోగ సమాధి
కలి మహి బికల కచు నిరుపాధీ"॥

అందువల్ల మొదట మనస్సును. ఒకవైపు మళ్ళించాలి. అవి రాముని చరణాలయితే అన్ని దుఃఖాలు దూరం అయి మనస్సు పవిత్రంగాను ఏకనిష్ఠంగాను ఉండి శాంతిని పొందుతుంది.

మానసిక అశాంతికి కారణం ఏమిటి? అని ప్రశ్నించుకుంటే ప్రపంచం యొక్క ద్వైధీభావన. ఈ ప్రపంచం రమణీయంగా కనబడుతున్నప్పటికి ఆలోచించుకుంటే భయంకరమైనది-

"అన విచార రమణీయ సదా సంసార భయంకర
భారీ,"

కాని వాస్తవానికి ఈ ప్రపంచం రమణీయమైనది కాదు, భయంకరమైనది కాదు. అది మనకు భయం కరంగా అనిపిస్తూ ఉంటుంది. దానికి కారణం మన భ్రాంతి, అవివేకము. ఈ రెండు తొలగిపోతే ప్రపంచం అంటే ఉన్న భయం నశిస్తుంది. ఇది హరి కృపలేనిదే సాధ్యం కాదు. ఈ విధంగా సదా హరి కృప వాంఛనీయము, హరికృపకి మూలం భక్తి అయితే భక్తికి మూలం మహత్వ అనుభూతి, దీనితో పాటు తన అల్పత్వము గుర్తింపు ఈ అనుభూతిని రెండు పంక్తులలో సరళంగా తులసీ ఎలా చెప్పాడో చూడండి.

రామ సో బడోహై కౌన్, మోసో కౌన్ ఛోటో?
రామ సో ఖరోహై కౌన్, మోసో కౌన్ ఖోటో?

భక్త కవికి భగవంతుని మహాత్మ్యము వర్ణించడంలో ఎంత ఆనందము లభిస్తుందో తన అల్పత్వము వర్ణిం చడంలోను అంతే ఆనందము లభిస్తుంది. ప్రభువు యొక్క అనంతమైన ప్రకాశంలో తన అసమర్థత, దీన దశ స్పష్టంగా కన్పిస్తాయి. ఈ విధమైన క్షోభ వలన ఆత్మకి పవిత్రత దానంతట అదే సిద్ధిస్తుంది. ఈ అవస్థకి చేరిన భక్తుడు తన దోషాలను, పాపాలను పెద్దవిగా చేసికొని చూసి కొంటాడు. వానిని సిగ్గువిడిచి వర్ణించడంలో అనంతమైన ఆనందము అనుభవిస్తాడు. గర్వము, మోసము ఇవేమి అతన్ని బాధించవు, అతని హృదయం తేలిక అవుతుంది. దాన్ని సంస్కరించే భారం అతనిపైన కాకుండా మరి యొకరిపైన కూడా ఉంటుంది.

ఈ అవస్థను వ్యక్తీకరించే పదాలు వినయ పత్రికలో ఎన్నో ఉన్నాయి.

"తూ దయాళు దీనహౌం తూ దాని హౌం భిఖారీ।
హౌం ప్రసిద్ధ పాతకీ తూ పాప పుంజ హారీ॥
నాధ తూ అనాధ కో అనాధ కౌన్ మోసోం।
మో సమాన ఆరత నహి ఆరతహర తో సోం॥
బ్రహ్మ తూ హౌం జీవ తుహీ ఠాకుర్ హౌం చెరో।
తాత్ మాత గురు సఖా తూ సబ విధి హితు మెరో॥"

ఈ విధమైన ఉన్నతమైన మానసిక స్థాయికి ఎదిగి తన లోపాలను తరచి తరచి చూసుకోవడమే కాక, వేలెత్తి చూపుకొనే ప్రవృత్తి ఎవరిలో ఉంటుందో వారిని గుర్తించకుండా ఎవరు ఉంటారు?

భక్తిలో ఇచ్చి పుచ్చుకోవడమనే భావన ఉండదు. భక్తికి బదులుగా దేనినయినా ఆశిస్తే అది భక్తి కానేరదు. భక్తుడికి భక్తివలన ఆనందమే దానికి ప్రతి ఫలము. అతను శక్తి, సౌందర్య, శీలమిశ్రితమైన ఆ సముద్రం ఒడ్డున నిలబడి దాని తరంగాలను వీక్షించడమే తన జీవిత పరమార్థంగా భావిస్తాడు.

"ఇహై పరమఫల, పరమ బడాఈ।
నఖశిఖ రుచిర బిందు మాధవ ఛబి నిరఖహి నయన అఘాఈ॥

ధ్యేయం, సాధన, సాధనను సూత్రీకరించే నిబంధన వినయ పత్రికను ప్రపంచంలోని 'సర్వోత్తమ భక్తి గ్రంధంగా నిలబెడతాయి. ప్రతిశబ్దంలోను సాధనలో నిమగ్నుడై ఉన్న తులసీ హృదయం కన్పిస్తుంది.

రామ రామ రామ రామ రామ రటు, రామ రామ జపు పపీహా।
రామ నామ నవ నేహ మేహకో, మన హఠి హోహి పపీహా॥

"షటధా" లేక నవధా" సాధన మరేమిలేదు. ఏది భక్తినొసగితే అదే సాధన.

రఘుపతి భగతి కరత కఠినాఈ,
కరత సుగమ, కరనీ అపార, జానై సోఈ జీహిబని ఆఈ॥

ఇంక ఉన్నతమైన భావనా భూమిని చేరుకోబట్టే తులసీ ఏ సంప్రదాయానికి చెందని వాడైనప్పటికి అన్ని సంప్రదాయాలకు ప్రియమైనాడు.

కొన్ని పదాలలో వేదాంత చర్చ కూడా కన్పిస్తుంది. మా యా వాదము మొదలగు వాదాలు అసంపూర్ణములని వాటి ద్వారా ఆత్మగత అనుభూతి అసంభవము, అని చెప్పబడింది. నిజమైన భక్తివలననే ఇది సాధ్యమవుతుంది. గోస్వామి అభిప్రాయమేమిటంటే ఇవన్ని పూర్తిగా సత్యాలుకావు. కాని కొంత వరకే సత్యాలు. ఇందులో ఏ ఒక్క దానినో నిజమని నమ్మి మిగిలిన వాటిని ఉపేక్షించడం నిజమైన తత్వదృష్టి అవదు. అందువలననే తులసీ వైరాగ్యం గురించి చెప్పేటప్పుడు అన్ని వాదాలను సమానంగా వాడుకున్నాడు.

ఇపుడు ''మానస్" కన్న" ''వినయపత్రిక'' ఏ విధంగా ఉత్తమ గ్రంధమో ఆలోచిద్దాము.

1. "రామచరిత మానస్"లోని భక్తిజ్ఞానం, కర్మని తోడు చేసికొని నడుస్తుంది. దాన్ని జ్ఞానకర్మ సమన్విత భక్తి అని చెప్పవచ్చు. అయితే వినయపత్రికలోని భక్తి అనన్యభక్తి. ఇది వేరొక దేవతను ఆశ్రయించదు. మరొక ఉపాసనా పద్ధతిని అవలంబించదు. జ్ఞానం. కర్మ ఇవి వెనుక పడిపోయాయి. తులసీ వెనకకి తిరిగి వానికేసి చూడదు. అతనికి భక్తి ఒక్కటే సాధన. దాని ద్వారానే తనదైవం దగ్గరికి చేరుకుంటాడు. అతడు ప్రతి దేముడిలోను రాముడ్ని చూస్తాడు. రాముడ్ని కూడా నీ చరణాలయందు భక్తి ఉండేటట్లు చూడమని ప్రార్థిస్తాడు. తన జీవిత అంత్య దశలో తులసీ ఈ బంధనాలన్ని తొలగించుకుని రాముడితో సంబంధం ఏర్పరచుకున్నాడని చెప్పవచ్చు.

2. మానస్‌లో తులసీ మనకు ఒక కధాకారుడిగా కన్పిస్తాడు. దానిలో తులసీ వ్యక్తిత్వము పాత్రలలో భక్తి, భక్తితో నిండిన ఉక్తులు, జ్ఞానవైరాగ్యాలకు సంబంధించిన మిమాంసతోనే నిండి ఉంటుంది కాని వినయపత్రికలో తులసీ యొక్క భక్తి హృదయం నిస్సంకోచముగా మనకు దర్శనం ఇస్తుంది. ఇందులో కథకు ప్రాధాన్యంలేదు. తులసీ యొక్క మిగిలిన గ్రంధాలలో కథ వ్యక్తిత్వాన్ని మరుగున పరుస్తుంది. కాని వినయపత్రికలో తులసీ యొక్క వ్యక్తిత్వము మనకు అనేక కోణాల్లో ఇంద్రధనుస్సు రంగుల్లో కన్పిస్తుంది.

3. మానస్ రచించిన తరువాత తులసీ ముఖ్యంగా సాధన విషయంలో జాగరూకుడుగా ఉన్నాడు. సాహిత్యం అతనికి అప్రధానంగా అగుపించిది. ఒక ప్రక్కన ఆరాధ్యరాముని సింహాసనము, రెండో ప్రక్కన దైన్యంతో ఉన్న పూజారి. అతనికి ఏమి కావాలి?

గెథే చనిపోతు ఏమి అన్నాడు ''ప్రకాశం కావాలి, అనంతమైన ప్రకాశం'' భక్త కవి ఏమి కోరుకుంటాడు హృదయానికి, మనస్సుకు పరిష్కారము, సంపూర్ణ పరిష్కారము. సంస్కార పూర్ణమైన ఈ భావన తులసీని పట్టువదలని ప్రయత్నశీలిగాను, ఎల్లవేళలా జాగృతంగాను ఉండేటట్లు చేసింది" అవిచల హరిభక్తి పథమే'' తులసీ యొక్క ధ్యేయము. సాధన అనే దారి ఖర్చు లేసికొని ఈ మార్గంలో యావజ్జీవితం పయనించాడు. ఆ యాత్రికుని యాత్రా చరిత్రే వినయ పత్రిక...

4. మానస్‌లోని తులసీ నిర్గుణ-సగుణ, రామ-శివ వీని మధ్య సమన్వయం ఏర్పరచి సంతోషిస్తాడు. కాని ఇక్కడ తులసీ దారణ భూమి విస్తృతంగా ఉంటుంది. అతను ప్రచలితమైన ధర్మాలన్నింటిని సీతారామ మయంగా భావించి తనవానిగా మలచుకున్నాడు. వినయ పత్రికలో హిందూ ధర్మాన్ని రామమయంగా తీర్చి దిద్దే అద్భుత ప్రయత్నం కనిపిస్తుంది. ఎందు కంటే తులసీ తన దేవతలందరిని ఏమని యాచిస్తున్నాడో చూడండి

1. గణేశస్తుతి-బసహి రామ సియ మానస మోరే।
2. సూర్యస్తుతి-తులసి రామ భక్తి వర మాంగే।
3. శివస్తుతి-దేహు కామరిపు రామచరన రతి, తులసీ
దాస కహ కృపానిధాన॥

4. దేవీస్తుతి-రఘుపతి పద పరమ ప్రేమ
తులసీ యహ అచల నేమ.
దేహు హ్వై ప్రసన్న పాహి ప్రనత పాలికా।

ఈ దృష్టికోణం తులసీ రామ భక్తికి ఎంత వ్యాపకత కల్గించింది అంటే మధ్య యుగంలో ఏ ధార్మిక సాంప్రదాయానికీ ఆ మాన్యత ప్రాప్తించలేదు.

5. వినయ పత్రిక అనుభూతి ప్రధానమైనది. వాక్యజ్ఞానము మానస్‌లోని ఉత్తర కాండకే పరిమితము. సత్యము వాదాలన్నింటికి పైన ఉన్నది. "శరణాగతి" మాత్రమే సత్యము. గీతలో భగవాను దేమన్నాడు?

"మామేకం శరణం వ్రజ"

అందువలన తులసీ ఆజ్ఞ ఏమిటంటే మనస్సులో తర్క వితర్కాలు లేకుండా "సముజి మనహి మన రహియే" అని అంటాడు.

మానస్‌లోని సగుణ భక్తి స్థాపించాలనే తీవ్ర ఉత్కంఠ, విశిష్టా ద్వైత ప్రభావము వినయ పత్రికలో కన్పించవు. తులసీ ఇచ్చట అన్ని వాదాల యెడల సహిష్ణుడయ్యాడు. ఈ వాదాలన్ని రామభక్తిలో లీనమయి ఏకాకారము పొందాయి.

ధార్మిక భేదాలను విస్మరించి తులసీ ఘోషిస్తాడు- హరిహి హరితా, విధిహి విధితా, సివహి సివతా జేహి దఈ।
సోఈ జానకీపతి మధుర మూరతి మోద మఈ మంగళ మఈ॥

(విష్ణువుకు పాలించి పోషించే శక్తి, బ్రహ్మకు సృష్టించే శక్తి, శివునికి సంహరించే శక్తి ఇచ్చినది- జానకీ వల్లభుడు, సుందర స్వరూపుడు అయిన ఈ రఘురాముడే.)

వినయ పత్రిక సాహిత్య పక్షం గూర్చి ఎంత చెప్పినా తరగదు. దీనిలో అనేక భావ ధారలు. శైలులు దాగి ఉన్నాయి. తులసీ పండితుడు, కవి. అందువలన సాధనకు పాండిత్య పూర్ణ పద్ధతి అవలంభించాడు. సంగీతం, చంధస్సేకాక, భాష, అలంకారం, వ్యంజన కావ్య లక్షణాల ప్రయోగాల్లో కూడా క్రొత్తదనం కనపడుతుంది.

అయితే "కావ్య చమత్కారము" గూర్చి మాట్లాడితే ఇందులో కేశవదాసు "రామచంద్రిక"లో లాగ పాండిత్య ప్రకర్ష కనవడదు.

కొన్ని పదాలు చూడండి:-

"ఇహై జ్ఞానికై తులసీ నిహారో జనభయో, న్యారోకై గనిబో జహా గనె గరీబ్ గులామ్"

ఓరామా! అన్ని విషయాలు ఆలోచించుకొని తులసీ నీ సేవకుడు అయ్యాడు. అయితే నీవు అతన్ని ఇప్పుడు "వేరుగా" లెక్కిస్తావా? (లేక) బీదవాళ్ళు, సేవకులు ఉన్నచోట లెక్కిస్తావా? "వేరుగా" అన్న శబ్దానికి తాత్పర్యం ఏమిటీ అన్న ప్రశ్న వస్తుంది. భగవంతునికి సేవకుడిగా అతనిపై విశ్వాసం కుదిరింది. ఇప్పుడిక వేరుగా లెక్కించడ మేమిటి? తులసీ భావం ఏమిటంటే "నన్ను పెద్ద పెద్ద జ్ఞానులు, దానులు, ధనవంతుల శ్రేణిలో ఉంచకు. అలా ఉంచితే నాకు చాలా అపాయము" మామూలుగా అయితే ఈ శ్రేణిలో ఉంచడం మంచిదే. కాని భగవంతుని సాన్నిధ్యం కోరే ఏకాంత భక్తునికి ఈ గౌరవం బాధాకరంగా ఉంటుంది. ఇంద్రుడు, కుబేరుడు, ధ్రువుడు వేరు వేరుగా ఉండి రాజభోగాలను అనుభవిస్తున్నారు. కాని బీదవాళ్ళయిన గుహుడికి, శబరికి, సేవకుడైన హనుమంతునికి జటాయువుకి లభించిన ఆనందం వారికి ఉందా? అందువలన "నన్ను వేరుగా లెక్కించకు"అని వేడుకున్నాడు. "గొప్పదనం అనే తలపాగా నాకు చుట్టవద్దు"ఈ ఉద్దేశ్యంతోనే తులసీ పై పంక్తి చెప్పాడని చెప్పవచ్చు. ఎంత విశిష్టత, ఎంత భిన్నత్వము.

న్యారోకై గనిబో జహాగనె గరీబ్ గులామ్.

2. ఏదో నాటికి తన స్వామికి తాను తప్పక గుర్తుకు వస్తానని తులసీ నమ్మకం. ఈ నమ్మకంతోనే

ఏళ్ళ కొలది వేచి ఉన్నాడు. కాని ఈ కలి వల్ల ధైర్యం కోల్పోతున్నాడు. అధీరుడై అంటాడు-

జద్యపినాథ! ఉచిత నహోత అస ప్రభుసో కరోం డితాఈ।
తులసీదాస సేవత నిసిదిన్ దేవత తుమ్హార నిఠురాఈ॥

ఈ పంక్తులలో పైకి మనకు విశేషమైన అర్థం కన్పించదు. కాని సూక్ష్మంగా పరిశీలిస్తే అర్థ గాంభీర్యం గోచరిస్తుంది.

హే ప్రభో! మీ యెడల పెంకిగాను, నిష్ఠూరంగాను ప్రవర్తించడం ఉచితంకాదు. ధర్మశాస్త్రాలకు అది విరుద్ధమైనది. కాని నేనేమి చేయను? ఆర్తుడ్ని, బాధాతప్త హృదయుడ్ని. ఎంత వరకు మౌనంగా ఉండగలను? అయితే నీవు "ఏం చెప్పాలనుకుంటున్నావు తులసీ''అని అడుగుతావు. నా సమాధానానికి క్షమించమని అడుగుతూ జవాబు చెప్తాను. నీవు "నిర్దయుడవు'' అని. ఇక్కడ వచ్చిన చిక్కేమిటంటే నిర్దయుడవు నీవు అయితే అయ్యావు కాని బాధ నాకు. ఎందుకంటే నా స్వామిని దోషరహితుడిగా చూడాలని నా అభిలాష. లోకంలో ఎక్కడ చూసినా నీవు నిర్దయుడవని వినడం నాకు బాధగా ఉంది. నా దుఃఖం దూరం చేసికోవడానికి ఈ సాహసం చేయవలసి వచ్చింది. ఎంతసూటిగా చెప్పాడు తులసి. సాధారణ మానవుడయితే"ఓదేవా! నీ నిర్దయ వదిలి నన్ను అనుగ్రహింపుము'' అని అంటాడు. కాని పైన వివరించిన సంపూర్ణత దానిలో ఎలా వస్తుంది? సామాన్యుడి మాటకి, మహాకవి వాక్కుకి గల తేడా ఇదే!

3. తులసీ తన స్వామి కృపకై నిరీక్షిస్తూ విసుగెత్తి పోయాడు. చివరిగా భగవంతునితో- ఇదిగో విను, నీ గుట్టు అంతా బయట పెట్టేస్తాను అంటూ-

హౌం అబలో కరతూతి తిహారియ చికవత హుతోన రావరే చేతే।
అబ్ తులసీ పూతరో బాంధహి సహిన జాత మొపై పరిహాస ఏతే॥

నేను నీరాకకై రెప్ప వేయకుండా చూస్తూ ఉన్నాను. నీవు కన్నెత్తి నావైపు చూడనయినా చూడలేదు. ఈ తులసీదాసు ఈ పరిహాసాన్ని సహించలేడు.

ఇచ్చట ఉపయోగించిన "పుకలా బాంధ్‌నా", "ఉపహాస్" అనే పదాలు చాలా విశిష్టమైనవి. నర్తకులు తమ ప్రదర్శన ముగిసిన తరువాత ఏమి లభించక పోతే, వాళ్ళు తమ పై బట్టను ఒక బొమ్మలా చేసి దానిని ఒక కర్రకి వేలాడ కట్టి, చూశారా, ఈ పిసినారిని" అంటూ దానిపై కొంత దుమ్ము కూడా జల్లుతారు. ఆ తిలకిస్తున్న పిసినారి ఈ ప్రవర్తనకి సిగ్గుపడి వాళ్ళకి ఏదో కొంత చెల్లించుకొని పంపిస్తాడు. తులసీ అనేది ఏమిటంటే "ఓ రామా, నేను కూడా ఒక కర్రపై గుడ్డ బొమ్మ వేసుకొని తిరుగుతాను. ఎవ్వరైనా ఇదేమిటి అని అడిగితే ఈయన మరెవ్వరో లోదు. పిసినారుల్లో శిరోమణి, అయోధ్యకి మహారాజు శ్రీరామ చంద్రుల వారు" అని చెప్పుతాను. అప్పుడయినా సిగ్గుపడి తలవంచుకుని నన్ను చూస్తావు ఆ విధంగానయినా నా మీద కనికరిస్తావు. ఈ ప్రజలంతా చప్పట్లు చరుస్తూ చూడండి. ఈ తులసీదాసు ఎంత మూర్ఖుడో! రామదాసుగా మారాడు. నిజంగా ఇతను రామదాసు డయితే ఇలా పిచ్చివాడిలా తిరుగుతాడా అని అంటున్నారు. ఇది నన్ను పరిహసించడం అనుకుంటున్నావా? కానే కాదు. అది నీకే. నన్ను పరిహసిస్తే నేనెన్నడు బాధపడను. సహిస్తాను. కాని నీకు జరుగుతున్న పరిహాసాన్ని సహించలేక పోతున్నాను. అందుచేత నాకు శరణమిచ్చి నీ పరిహాసాన్ని దూరం చేసికో"

ఈ పంక్తులలో ఏమి చమత్కారం దాగి ఉంది. తులసీ సాహిత్యం అమర సాహిత్యంగా మారడానికి ఈ ఉదాహరణ చాలదా!

4. హౌం సనాథ హ్వై హౌ సహీ, తుమహు అనాథ పతి జో లఘు తహి ''నభితై ఎరో."

ఈ పంక్తికి సూటిగా అర్థం చెప్పితే "నేను నిజంగా సనాథుడనవుతాను. నీవు నా అల్పత్వమునకు భయపడ

వద్దు, భయపడకుంటే అనాధపతి" పదవి పొందు తావు." అయితే అల్పత్వమునకు భయపడటం ఏమిటా? అన్న ప్రశ్న వస్తుంది. కాని సందేహానికి ఆస్కారంలేదు. ఇది సరి అయినదే. గొప్పవారు బీద వారికి భయపడుతూ దూరంగా జీవిస్తారు. మాట్లాడటం మాట అటుంచి ఎదురు పడటానికి కూడా ఇష్ట పడరు. మనము ఈ బీద వాళ్ళ ప్రక్కన నిలుచుని ఉంటే మన గొప్ప తనానికి దెబ్బతగులుతుందని వారి భయం. దెబ్బ అంటే మరేమి లేదు. వాళ్ళ సాటి వాళ్ళు వాళ్ళని వెలి వేస్తారు. అందువల్ల తులసీ ఉద్దేశ్య మేమిటంటే "ఓ రామా, నా ఈ చిన్నతనం లేదా అల్పత్వానికి భయపడకుండా ఉంటే[2] పనులు నెర వేరుతాయి. ఒకటి నేను సనాధుడవుతాను. నీవు అనాధ పతివి అవుతావు". ఏమి చక్కని ఒప్పందము.

౬. వినయ పత్రికా దీన్ కే బాప్! ఆప్‌హీ బాంచో!'

''ఆప్ హీ బాంచో" అని ప్రయోగించడంలో ఒక చమత్కారం ఉంది. రాజ దర్బారులో అనేక మంది ఉంటారు. ఈ పత్రిక ఏ మంత్రి చేతిలో నయినా పడ వచ్చు. దానిలో తన మనస్సుకి నచ్చినవి అతను చేర్చవచ్చు. నచ్చనివి తొలగించ వచ్చు. ఒక వేళ చదివితే కొన్ని విషయాలు ఒదిలేసి చదువ వచ్చు. లేనివి ఉన్నట్లుగా చదవవచ్చు. అందువల్ల ఓ తండ్రీ! దయచేసి నీవు స్వయంగా చదువు, చదివి నీ ఆమోద ముద్ర వేయి. రాజ దర్బారులోని పద్ధతులకు వ్యతిరేక ముగా చేయమని నేను చెప్పడం లేదు. మంత్రులను సలహా అడుగు. కాని నిర్ణయము మటుకు స్వయంగా మీరే గైకొనండి. ఇక్కడ ''బాంచ్'' శబ్దం విశేషమై నది. గోస్వామి రాముడ్ని వినయ పత్రిక స్వయంగా చదవమని, స్వయంగా నిర్ణయం గైకొనమని యాచి స్తున్నాడు. అందువలన "ప్రభో,మహారాజా, దేవా" అని అనకుండా ఇంటిలో వాడుకునే ''బాప్" శబ్దం వాడి తన కోరికకు బలం చేకూర్చాడు. ఎందుకంటే తనయునికి తండ్రివద్ద సంకోచం ఉండదు. ఆమోద ముద్ర వేయమని అడగడానికి ఈ సంబంధం మరింత దోహదం చేయిస్తుంది.

ఇవి కావ్య సుధా సాగరంలోని కొన్ని బిందువులు మాత్రమే. వీనితో తృప్తి పడవద్దని ఆ సాగరం లోంచి తనివి తీరగా మీరు స్వయంగా ఆస్వాదించా లని నా ఆశ, ప్రార్థన.

ఆఖరి దయినా అతి ముఖ్యమయిన విషయము. వినయ పత్రికలోని పదములన్ని చక్కని రాగాలలో ఆలపించవచ్చు. ఏపదము ఏరాగంలో ఆలపించాలో ఆ వివరణ కూడా దీనియందు ఉన్నది. తులసీ భక్తి ప్రపంచాన్ని విడిచి ఉండదు. దానిలో జీవన నిర్మాణానికి అవసరమైన అత్యంత ఉన్నతమైన ఆదర్శాలు ఇమిడి ఉన్నాయి. దాని పునాది నైతికతలో ఉంది.

''సంతోషము, పరహిత చింతనము, మృదు సల్లా పము, రాగ ద్వేష హీనత, సుఖ దుఃఖములయందు సమదృష్టి" ఈ గుణాలన్ని ప్రతి వ్యక్తికి, అతడు రామ భక్తుడయినా కాకున్నా, ఉండవ సినవే కదా! నా అభిప్రాయము ఏమిటంటే సంగీతజ్ఞు లందరికి ఇటువంటి పదాలతో నిండి ఉన్న వినయ పత్రిక రసా స్వాదానికి ఆహ్వాన పత్రిక. అందులో వారి ఆనందా నికి అవధులుండవు. అంతేకాక వారు ధన్యులవడమే కాక మానవజాతిని కూడా ధన్యత కావించ చ్చు.

పాశ్చాత్య దేశాలలో బైబి లోని డేవిడ్ భజ లు అద్వితీయం అని చెప్పు కుంటారు. కాని వారు వినయ పత్రిక చూపితే డేవిడ్ భజనలని కూడా మరపించే శక్తి దీనికుందని చెప్పుతారు పాశ్చాత్య విద్వాం సుడు డా॥ గ్రియర్సన్ క్రైస్తవులందరికి వినయ పత్రికలోని 142, 148 పదాలను తప్పక చదవమని సలహా ఇచ్చినాడు.

వాస్తవానికి ఈ గ్రంథం సర్వకులాలకు, సర్వజనా వళికి విశ్వశ్రేయస్సును ఉద్దేశించి వ్రాయబడింది. ఎందుకంటే తులసీ తన గోడు వివరించు కుంటూ మానవ జాతి గోడు వివరించాడు. తనని రక్షించ మంటూ మానవజాతిని రక్షించమని వేడుకున్నాడు మహాత్ములకు "స్వాంత సుఖాయ" అన్నది ''పరజన హితాయ" లో ఉంటుంది. ఎందుకంటే వారు గీతలో ప్రవచించినట్లుగా—

'యదాత్మని చ్ఛేత్ తత్ పరస్యాపి చింతయేత్' అని భావిస్తారు.

పి. వి. యల్. సుబ్బరావు
యమ్.ఏ., బి,యస్.సి., బి;ఇ.డి.
కొత్త అగ్రహారమ్, విజయనగరమ్-1

కథానిక

# మొగిలి పొదల్లో కాలనాగులు

—రచన : కె. కోదండరామారావు

కాల ప్రవాహం సాగిపోతూంది.

ఆ వరవడిలో ఎన్నో సంవత్సర కాలాలు హరించుకు పోతున్నాయి.

రాజులు, రాచరికాలు, నిరంకుశపాలన, నియంతృత్వం ఇవన్నీ ఈ అనంత కాలవాహినిలో వెనక్కి వెళ్ళిపోయి ప్రస్తుతం మనం ప్రజాస్వామ్య పరిపాలనలో పడిపోయాం.

గ్యాసుదీపాల స్థానంలో కరెంటు లైట్లు వెలిగాయి

బండెద్దుల స్థానంలో మోటారు వాహనాలు వెలిశాయి. చెకుముకి రాళ్ళ స్థానంలో అగ్గిపెట్టెలు చేరాయి.

వీనులకు విందు కలిగించటానికి రేడియోలు, కళ్ళకింపు చేకూర్చటానికి టెలివిజన్లు, చలన చిత్రాలు, రంగు రంగుల ప్రపంచంలో ఎన్నో రకాలుగా శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం పెరిగి మనం యంత్రయుగంలోకి చేరుకున్నాం.

మానవుని మేధస్సు ఎంత పెరిగినా, సరికొత్త యుగం వైపు ఎంత వేగంగా అడుగు వేసినా, పెరుగుతున్న అధిక జనాభా, క్షీణించి పోతున్న అహారోత్పత్తుల మూలంగా ఆ నాటికీ ఈ నాటికీ సామాన్యుని సమస్యలు సమస్యలుగానే మిగిలిపోయి మానవుని జీవన ప్రమాణం ఇంకా తరిగిపోయి మనం పురోగమనం వైపు అడుగు వేయలేక పోతున్నాం.

మనిషి జీవించటానికి కావలసింది గాలి, నీరు, ఆహారం. ఈ మూడింటిలో ఏది లోపించినా బ్రతకజాలం.

నీరు, గాలి ప్రకృతి సహజమైనవి. కేవలం ఆహారం మాత్రమే మనం సంపాదించుకోవలసినది.

మరి ఆహారం ఎలా రావాలి ?

అది ఉత్పత్తి జరగాలంటే భూమిని దున్నాలి. విత్తనం చల్లాలి. ఎరువులు వేయాలి. తెగుళ్ళు నివారించాలి. పంట కోయాలి. నూర్చాలి.

ఎన్ని రకాలుగా కష్టించినా-ఎంత శ్రమ చేసినా వాతావరణ ప్రభావం కూడ అందుకు తోడుగా వుండాలి.

పల్లెటూరి కథనాన్ని గురించి ఏ బస్తీ వాళ్ళను అడిగినా పచ్చని చేలు, పంట పొలాలు, ఆహ్లాదకరమైన వాతావరణం, అందమైన ప్రకృతి అని సులభంగా అనేస్తారు. కవులు తమ కావ్యాల్లో ఈ విషయాన్ని జనరంజకంగా పాఠక లోకాన్ని ఆకర్షించేలా వర్ణించి మరీ రాస్తారు. అయితే అదెంతవరకు నిజం? అందులో గల సత్యా సత్యా లేమిటి?

పచ్చని పంట పొలాలవెనక, ఆహ్లాదకరమైన ఆ వాతావరణం వెనక ఎంత చరిత్ర వుంది? ఎన్ని వ్యయ ప్రయాసలున్నవి? ఎంత మంది శ్రమ జీవుల రక్తదానం వుంది? దేశానికి వెన్నెముక అయిన రైతు ఎలాంటి ఇబ్బందులను ఎదుర్కొన గలుగుతున్నాడు? అన్నదాత అయిన అతడికి గల కష్టాలేమిటి? ఈ విషయాలన్నీ ఒక కంట కనిపెట్టే బాధ్యత కష్టార్జితాన్ని ఆరగించే ప్రతి వ్యక్తిమీద వుంది.

ఒక ఉద్యోగస్తుడు తన వుద్యోగ రంగంలో క్రమంగాపై స్థాయికి చేరుకోగలుగుతున్నాడు. గుమాస్తాగా చేరినవాడు కొన్ని రోజులకు పెద్ద గుమాస్తా

అవుతున్నాడు. పెద్ద గుమస్తా ఆఫీసర్‌గా- ఆఫీసర్ ఇంకోపై మెట్టు ఆఫీసర్‌గా- ఇలా క్రమంగా పైకెదిగి పోతున్నాడు.

కిళ్ళీ కొట్టుతో వ్యాపారం మొదలెట్టిన వ్యాపారి కొన్నాళ్ళకు హోల్ సేల్ వ్యాపారస్తుడిగా మారిపోతున్నాడు. కాలక్రమంగా రాజధాని నగరంలోనే మెట్టా వేసి ఇతర దేశాలకు సరఫరా చేసేటంత బిజినెస్ దారుగా మారి ఇంకా పైకెళ్ళి పోతున్నాడు.

మరి వ్యవసాయదారుడు ఎటు పోతున్నాడు? వడగళ్ళ వానలో దారీ తెన్నూ తోచక ఆశ్రయం దొరకని అనాథలా ఆక్రందనలు చేస్తూ అక్కడే నిలుచుండి పోతున్నాడు.

పండించిన ధాన్యానికి గిట్టుబాటు ధరలేక, పండించే పంటల పెట్టుబడికి వలయు సరంజామాకు కావలసిన ధరలకు తట్టుకొననూలేక. వడ్డీ, పెచ్చు, నాగు వ్యాపారస్థుల బాణ ధాటికి బలౌతూ దారి తెలియక గిజ గిజ లాడిపోయి చావు బ్రతుకుల మధ్య నలిగి పోతున్నాడు.

పెట్రోలు లేకపోతే మోటరు నడవదు- తీగతెగితె విద్యుత్తు ప్రవహించదు. గ్యాసులేనిది దీపం వెలగదు. గడియారము లేనిది టైమూ తెలియదు. భోజనంలేనిది మనిషీ బ్రతకడు.

మనిషే బ్రతకని తర్వాత మోటారుకు పెట్రోలు, దీపానికి గ్యాసు, విద్యుత్తుకు తీగ, గడియారానికి టైమూ -ఇవేమీ అవసరము లేదు.

వ్యవసాయ దారుడు నీరసించిన తర్వాత తిండి దొరకదు. అది దొరక్కపోతే ఏ యంత్రాంగము అవసరపడదు.

ఒక్కొక్క వ్యవసాయదారుడు ఒక్కొక్క రకమైన ఇబ్బందులకు గురౌతున్నాడు.

అది బావి. ఏపుగా పెరిగిన వేపచెట్లు, దట్టంగా వున్న చింతచెట్లు, నల్లగా బలిష్ఠంగా వున్న తుమ్మలు ఎత్తైన బావిగడ్డ, బావికి కరెంటు మోటరు, బావి క్రింద పచ్చని వరిచేను-

మోకాళ్ళ క్రిందకు దిగని పంచె, నల్లని బట్టపై తెల్ల చారికలుగల తలపాగా, రామబాణం అంగీ, అనుభవాల వత్తిడిలో ముడతలు పడిపోయిన మొఖం, కిర్రు చెప్పులు, దుడ్డుకర్ర-ఇవన్నీ కలిపితే భీమయ్య అయిపోతాడు

ఆ బావికీ, ఆ ప్రకృతికీ ఆయన స్వంతదారు.

భీమయ్యకు అయిదెకరాల మాగాణి, రెండెకరాల మెట్ట, రెండంకల పశుసంపద, ఒక భార్య, ఇద్దరు మగసంతు-

గత నాలుగేళ్ళ క్రితం భీమయ్య వ్యవసాయ రంగంలో అడుగిడినప్పుడు రంగు రంగుల కలలు అతని కళ్ళముందు కదలాడేవి. తను వ్యవసాయంపై సాంద్ర వ్యవసాయ పద్ధతి ద్వారా సాధించే ఫలసాయాన్ని గురించి అంచనా వేసుకున్నప్పుడు. ఆనంద లోకాల్లో విహరించేవాడు. వున్నట్టుండి గగన సీమలో విహరిస్తున్నట్టు కలలుగనేవాడు.

కాల క్రమేణ ఎందుకో ఆ ఆశయం అంతకంతకూ అంతరించి పోతూవుంది. మునుపటి ఉత్సాహం లేదు. అతని పరిస్థితి గాలి తీసిన బెలూన్‌లా తయారయ్యింది. పల్లేరు ముళ్ళలో నడుస్తున్న ప్రయాణీకుడిలా తోచింది. అందులో సామాన్యుడి వ్యవసాయానికి మరిన్ని కష్టాలు.

చేనుకు తెగులు సోకిందంటే స్ప్రేయర్ దొరకదు. స్ప్రేయర్ సిద్ధంగా వుంటే మందు లభించదు. ఈ రెండూ సమకూర్చుకునే సరికి చేను మిగలదు. సర్కారు నుంచి సప్లై చేసిన స్ప్రేయర్లు నెల తిరక్క ముందే మూలకు చేరిపోతాయి.

వూరిలో ఉండేది వంద మంది వ్యవసాయ దారులైతే స్ప్రేయర్ లభించేది ఒక్కటే. మరి అందరు రైతులకు సరిపోను స్ప్రేయర్లు సర్కారు మాత్రం

ఎక్కడి నుంచి సరఫరా చేస్తుంది? ఆలోచించాల్సిన విషయమే.

మరి చేతిడబ్బు పెట్టి కొనటానికి వ్యవసాయదారుని వద్ద స్తోమతు వుందా. సామాన్యుడికి అంత శక్తి వుంటే ఇంకా కావల్సిందేముంటి. పెద్ద వ్యవసాయ దారులవద్ద రిజర్వుగా వున్నప్పటికీ అవి వాళ్ళపొలాలకే సరిగ్గా పనిచేయలేని స్థితిలో ఇతరులకెలా ఇవ్వ గలుగుతారు.

భీమయ్య వ్యవసాయంలోకి దిగిన ప్రారంభ సంవత్సరం ఫలసాయం బాగానే కళ్ళజూశాడు. చీడపీడల బాధలేదు. డీజిల్ కొరతలేదు. ఎరువులు బాగానే దొరికాయి. మందులు బాగానే చల్లాడు. కాలాభావమేమి లేదు. పంట అంచనా ఎస్టిమేటేసుకున్న ప్రకారం ఏవరేజి బాగానే తీసేడు.

మరుసటి సంవత్సరం మొదలయ్యింది నాటకం లోని ద్వితీయ ఘట్టం.

బావికి కరంటు మోటరు తీసుకొనవలెనని కోర్కె వుత్పన్నమైంది మోటరు ఎలాగూ తీస్కుంటున్నాం కదా బావి పూడికె గూడ తీయించితే బాగా వుంటుం దని తోచింది.

కోరికె సమంజసమైందే-

ఆయిలింజనుకు ఆరుమాసాలకయ్యే ఖర్చు కరెంటు మోటరుకు కనీసం రెండు సంవత్సరాలకు సర్దివస్తుంది. అవి అనుభవస్తులు చెప్పిన వాక్కులు.

రేడియో అనవుస్సు సన్న కారు రైతులకు అప్పు లిస్తున్నారని పేపర్లో తాటికాయంత అక్షరాలతో హెడ్ లైనూ. మరింకా ఆలస్యం చేయదలచుకోలేదు. "ఆలస్యం అమృతంవిషం" శాస్త్రులవారి మాటలు మన స్సులో మెదిలాయి.

అడాప్షన్ చేసుకున్న బ్యాంకుకి అప్పుకొరకు అర్జీ పెట్టుకున్నాడు.

బ్యాంకు వాళ్ళ నల్లజీప్ వచ్చింది!

భీమయ్యతో పాటే అప్పుకోసం పాతిక మందిదాక అర్జీ పెట్టుకున్నారు.

సంతృప్తిగా సర్కారు వాళ్ళిచ్చే డబ్బుతో వచ్చే కరెంటు మోటరును గురించి కలలుగంటూ కాలక్షేపం చేశారు కొన్నాళ్ళు.

గడచిన మాసం రోజుల కాలంలో మూడు సార్లు బ్యాంకుకు వెళ్ళొచ్చాడు. పోయిన ఈ మూడు పర్యా యాలు కూడ పై ఆఫీసుకు వెళ్ళిన ఫైలింకా తిరిగి రాలేదని మేనేజరు జవాబు.

కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి వచ్చాడు.

వచ్చిన ప్రతిసారీ కాళ్ళకు నీళ్ళందిస్తూ 'కరెంటు మోటరు తెచ్చారా' భార్య ప్రశ్న. విసుక్కుంటూ తన జవాబు.

ఈ మధ్యన పైరవీలోపడి పెరు వైపు కూడ సరిగ్గా వెళ్ళటం మానేశాడు. అతనొక్కడే కాదు. అప్పు కోసం దరఖాస్తు ఇచ్చిన వాళ్ళందరి పరిస్థితీ అదే.

చూస్తూండగానే కాలం ఆగిపోవటం తన కిష్టం లేనట్లు రెండు మాసాలు వేగంగా ముందుకెళ్ళి పోయాయి. డబ్బు మూడవనెలకూడ చేతికందలేదు సరికదా ఏవో సర్టిఫికేట్లు తక్కువున్నాయని బ్యాంకు నుంచి జవాబు.

అత్తగారిచ్చిన అరతులం బంగారుఉంగరం కంసాలి వాళ్ళ కబంధ హస్తాల్లో కరిగి పోయినపుడు బాధపళ్ళేదు కరెంటు మోటరు సంబరంలో-

పచ్చ నోట్లు వచ్చినట్టే వచ్చి వెచ్చగా మూలకు వదిగి వుండటం తమ కిష్టంలేక. కరెంటు మోటరు ఖర్చు క్రిందికి తమ దారిన తాము వెళ్ళిపోయాయి.

వుంగరాన్ని పణంగా ఇచ్చిన తర్వాత అప్పు తనకు చాలా రోజులు ఆగటం ఇష్టం లేనట్లు సరిగ్గా నవ మాసాలు మోయక ముందే నాల్గు మాసాలకే కరెంటు మోటరొచ్చేసింది.

ఆ క్షణంలో రాష్ట్రపతి బహుమతి అందుకున్న రచయితలా ఎగిరి గంతేసాడు- అతనిలాగే అప్పు వచ్చిన వాళ్ళందరూ సంతోషించారు. ఉన్నట్టుండి పుష్పక విమానం వచ్చి అందరినీ పైకి తీసికెళ్ళినట్టు పరవశించి పోయారు.

భీమయ్య కరెంటు మోటరు కొక చిన్న గది ఏర్పాటు చేశాడు. ఎర్రని జీరోలైటు మీటరు బోర్డుపై మిణుకు మిణుకు మంటుంటే భీమయ్య గుండె కలుకు కలుకు మంది.

చేను ఏపుగా పెరిగింది. దుంపకు పదిపిలకలు. పిలకకు రెండు గొలకలు. దోమకూడ పీగటానికి స్థలం లేనంత దట్టంగా మబ్బులు పట్టిన మేఘంలా ఆకర్షణీయంగా అందాలు చిందుతుంది.

భూమాతకు ముదురు గోధుమ వర్ణపు చీర కట్టుబడిందేమోనని భ్రమపడేలా వుంది పంటచేను.

భీమయ్య వ్యవసాయంపై అందరి ప్రశంసలు. అందరి చూపులు ఆరోగ్యంగా ఎదిగిన ఆ చేనుపైనే– అందరి నోట ఒకే మాట. చేసిన కష్టం భూమిదాచు కొనదని-

ఉన్నట్టుండి వుపద్రవం ముంచు కొచ్చింది-
రెండు రోజుల నుంచి కరెంటులేదు.
లైను కట్టయిందన్నారు కొందరు.
కరెంటు షార్టేజీ అన్నారు ఇంకొందరు.
సప్లై లేదన్నారు మరి కొందరు.

ఎవ్వరు ఎలా వ్యాఖ్యానాలు చేసినా చేను ఒట్టిబారి పోయింది. సుమారు నాల్గు రోజుల తర్వాత ఒక శుభ ముహూర్తాన కరెంటొచ్చింది. జనం పూర్తిగా ఎక్కక ముందే కదిలిపోయే బస్తీ బస్సులా పొలం చివరి వరకూ నీరు చేరక ముందే మళ్ళీలైను పోయింది.

మరునటి రోజువరకే నరమాంసం కొరకు నిరీక్షిస్తున్న రాక్షసుల్లా నోరు తెరుచుకు పోయిన భూమాత చీలిక కన్పించి-రేసు గుర్రాలను సైతం తన మీదుగా దౌడు చేయించు కొనగలనన్న హామీ ఇస్తూ సవాలు చేస్తున్నట్టుగా తోచింది.

భీమయ్య గుండె లదిరాయి. హృదయంలో రైళ్ళు పరిగెడు తున్నట్టుగా శబ్దాలు వినిపించాయి. నిమిషానికి గుండె ఎంత వేగంగా కొట్టుకుంటుందో బోధపడలేదు. ముఖం కళా విహీనమై వేటుకు నెత్తురు చుక్కలేకుండా పోయింది.

మౌనంగా రోదించాడు.

ఆరోజు నుంచి వరుసగా రేయింబవళ్ళు జాగారాలు తప్పలేదు. కరెంటు ఏ క్షణాన వస్తుందోనని నిరీక్షణ జరిపాడు. కళ్ళల్లో వత్తులు వేసుకొని చూశాడు.

ఏదో ఆశ-హృదయంలో ఏ మూలనుంచో వుత్పన్నమై ఆశయాన్ని కల్పిస్తుంది. రాత్రిళ్ళు కంటికి కునుకు రావటం లేదు.

ఎండి పోయిన పొలం-బ్యాంకు వాళ్ళ అప్పు కళ్ళెదుట మెదులుతు రక రకాల కలలొస్తూ కలవరింతలు మెదలయ్యాయి.

ఏదో ఆరాటం-గుండెలో గుబులు-నిరాశ.

పైరును చూస్తూంటె అన్నం నోటికి సహించటం లేదు. బట్టలు శరీరం మీద నిలవటంలేదు. పైరు వెండి రూపం దాల్చి ఎండుటాకులు వెక్కిరిస్తుంటె, అవైపు చూడటానికైనా మనస్కరించకుండా వుండి., కళ్ళనుంచి కన్నీటి బొట్లు రాలుతూ వుంటె-ప్రకృతి అతని పరిస్థితికి వెక్కిరించినట్టు చూస్తుంటె సిగ్గుతో ముఖం వాలిపోయింది. ఆ పంట అలా తెల్లవారి పోయింది.

బస్తీలోని బారుషాపుల్లో రంగు రంగుల లైట్లు, పెద్ద వాళ్ళ పేరంటాల్లో మెర్క్యురీలైట్లు, రసిక గృహాల్లో రంగు నులిమిన లైట్లు-పేకాడటానికి క్లబ్బుల్లో లైట్లు, వినోదాన్ని రంగరించుకొని జీర్ణించుకోవటానికి సినిమాల్లో లైట్లు-కాని వ్యవసాయదారుని గుండెల్లో-పొలంలో ఆరని మంటలు రేపటానికి చీకటి నృత్యాలు-భగ్న విషాదాలు-చీకటి ఆక్రందనలు-

బ్యాంకులో అప్పిచ్చిన వాళ్ళు మళ్ళీ ఇవ్వరు.

అవురావురు మంటూ ఆశ్రయించాడు భీమయ్య వడ్డీ వ్యాపారిని-నాగుల బేరం వర్తకుడిని-

చిత్రగుప్తుని చిట్టాలో ఆయుష్షుతీరి, తమ నగరానికి రప్పించుకోవటానికి ఎదురు చూసే యమభటుల్లా కాచుక్కూర్చున్న వ్యాపారికి-తన వ్యాపారపు ఎత్తుల్తో ఎదుటి వాడిని తెలివిగా గల్లంతు కొట్టించ గ ల న నే ధీమాగల వ్యాపారికి చేపల కోసం గాలం వేసిన జాల రిలా కనిపెట్టుకొని కూర్చున్న వ్యాపారికి-అది చక్కని అవకాశంలా తోచింది. అందుకే ఆహ్వానం-అతి విన యం-అమితగౌరవం-ఆత్మాదరణ-అన్నీ లభించాయి ఆ క్షణంలో భీమయ్యకు.

భీమయ్య దురదృష్టానికి మొసలి కన్నీరు కార్చాడు. పెదవి విరిచాడు. విషాదాన్ని మోస్తున్న వాడిలా ఫోజులు విసిరాడు-

మోసం చేసిన కరెంటును-ద్రోహం నమ్మిన వాడికే తలపెట్టే దేవుడిని కరెంటునీ దూషించాడు వ్యాపారి- ఆపదలో వున్న వాళ్ళను ఆదుకోవటం తన ధర్మ మన్నాడు. అప్పటి తన కనీస కర్తవ్యం అదే అన్నట్టు వాగ్దానం చేసినంత పని చేశాడు వ్యాపారి.

భీమయ్యకు అప్పిచ్చి మళ్ళీ వ్యవసాయం సాగేలా చేసాడు. భూమిని తాకట్టుగా వుంచుకొని, ఇరవై శాతం వడ్డీ రాసుకొని. అప్పు తీర్చకపోయినట్టయితే పంట నూర్పిడైన తర్వాత భూమి తన స్వాధీనం చేసు కోవటానికి ఒప్పందం చేసుకొని ప్రామిసరీ నోటు వ్రాయించు కున్నాడు.

ఆ క్షణంలో భీమయ్యకు షావుకారి కరుణామూర్తిలా కనిపించాడు. మంచికి మారు పేరులా తోచాడు. షావు కారి స్థానంలో దేవుడే సాక్షాత్కరించినట్టుగా భావిం చాడు.

ఆ పంట-భూమి తనకు చేసిన కష్టాన్ని దాచుకో లేదు. ఫలితం బాగానే వెళ్ళింది

షావుకారి బాకీ-పండిన పంట రెండు పోటీవేసు కొన్నాయి.

వడ్డీతోసహా పెరిగిన వ్యాపారి అప్పు ఎదుట భీమయ్య పండించిన పంట ఎందులో సరితూగ లేదు.

భీమయ్య పొలం దున్నడం, పండిన ధాన్యాన్ని వ్యాపారి ఇంట్లో నింపటం, వరుసగా మూడు పంటల వరకు జరిగింది. చివరకు వ్యాపారే గెలిచాడు. అరెకరం అప్పుక్రింద జీర్ణించుకొని పోయిం తర్వాతగాని వ్యాపా రితో కనెక్షన్లు కట్టవ్వలేదు భీమయ్యకు.

కరెంటు మోటరుతో కాపురం వెలిగించిన భీమయ్య పరిస్థితి అలావుంటె ఆ ప్రక్కనే వున్న బావి స్వంత దారు రంగన్న ఆయిలింజనుతో వ్యవసాయం చలా యించి, అతడు మాత్రం ఏం మిగిల్చుకున్నాడు? కరెంటుసప్లై సరిగ్గా జరగక భీమయ్యకు నష్టం జరి గితే-ఆయిల్ సమయానికి దొరకక రంగన్న కూడ ఇతని కోవకే చెంది పోయాడు.

ప్రభుత్వ మిచ్చిన రేషన్‌కార్డు తీసుకొని కాలుగాలిన పిల్లిలాగా తాలూకాఫీసుకు తిరగని రోజు లేదు- డీజిల్ కొరకు-ఒక రోజు దొరికినట్టూ-ఒక రోజు దొరకనట్టూ ఆయిలు తన ప్రభావాన్ని చూపిస్తుంటే-బక్కచిక్కిన టి. బి. షేషంటులాగా చేనుకూడ పీలగా తయారయ్యి, పెట్టిన విత్తనాలు కళ్ళజూసే వరకు బ్రహ్మదేవుడు సాక్షాత్కరించినంత పనయ్యింది.

ఒక భీమయ్య-రంగయ్య మాత్రమేకాదు. ప్రతి వ్యవసాయ దారుడు అనుభవిస్తున్న చేదు నిజమిది

ప్రతి సంవత్సరం పంటలిలా ఎదురు దెబ్బతీస్తుంటే తెచ్చిన అప్పులు వడ్డీతో సహా ఆకాశాన్నంటుకు పోతూ వుంటే-నిత్యావసర వస్తువుల ధరలు మండిపోతుంటే రైతు ఎలా బాగుపడ గలుగుతాడు.

భారత దేశం వ్యవసాయం దేశం-అందుకే మిగతా రంగాలకంటే దీనికి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాలి- కరెంటు దుర్వినియోగపు పనులకు వెచ్చించకుండా

వ్యవసాయానికి సరిపోయినంత సప్లై చేయాలి-ఆయిల్ కూడ అలాగే చేయవలసి వుంటుంది. అలా చేసిన నాడే దేశంలో సౌభాగ్యం వెల్లివిరియ గలుగుతుంది-

పండించిన పంటకు గిట్టుబాటు ధర లభించక-
ఆకాశాన్నంటుకునే ఎరువుల ధరలను అందుకోలేక-
నార్లుపోసుకునే సీజన్లలో చెర్వుల్లోకి నీరు రాక-
తయారైన పంట చేలపై వడగళ్ళ ప్రభావం పడుతూ ఆ తాకిడికి తట్టుకోలేక-
అతివృష్టి తాకిడిని నేను తట్టుకోలేనని ఒక వైపు భూమి ఘోషిస్తూ వుంటే-
అనావృష్టి ప్రభావానికి భూదేవి ఆక్రందనలు చేస్తూ వుంటే-

సముద్రంలోని అలల్లాగా ఒక పంట వ్యవసాయ దారుణ్ణి వడ్డుకీడ్చి కొడితే- మరో పంట లోపలకు లాక్కెళుతుంది.

ఉద్యోగస్తులు తమ కర్తవ్యాలను సరిగ్గా నిర్వహించినా నిర్వహించక పోయినా వాళ్ళకు అనేక రాయితీలు-

అస్తమానం తన యావత్ శక్తిని ధారపోస్తూ రెక్కలు ముక్కలు చేసుకొని రక్తదానం చేసే అన్నదాత అయిన వ్యవసాయ దారునకు ఏ రాయితీలూలేవు- ఓదార్పు మాటలు-ఒట్టి చేతులు.-

అతడిని అన్నదాతగా మిగిలించాలంటే అన్నిశక్తులు అతనిపై దయాదాక్షిణ్యాలు ప్రదర్శించాలి =

ఆనాడే వెన్నెముకలాంటి రైతు వెలుగుబాటవైపు దారి వెతుక్కో గలుగుతాడు.

ఆ శుభ సమయం కోసం చూద్దాం- మొగిలి పొదలో కాలనాగులున్నట్లే పంట పొలాల వెనక విషాద గాథలుంటాయని మరచి పోవద్దు.

కె. కోదండరాం రావు,
పోస్టు : గోకపరం (గ్రామం)
తాలూక : కల్వకుర్తి, మహబూబ్‌నగర్ జిల్లా.

# ఆంగ్లేయుల యూరపియన్ మూలముల అవలోకనం

—ఆంగ్ల రచన : ఫిలిప్ హోవార్డ్

పశ్చిమ యూరపు సంస్కృతికి గ్రీకు తత్త్వ శాస్త్రం, సౌందర్యదర్శనం, సిద్ధాంతం, ఆదర్శం, భావన, దృక్పథం ఇత్యాదులు తాతయ్య, నాన్నమ్మ, అమ్మమ్మల వంటివి; అక్షరమాలలో మొదటి అక్షరం వంటివి. ఫిలాసఫీ, ఈస్థటిక్స్, థీరీ, ఐడియాలజీ వంటి పదాలకు ప్రతిదానికి గ్రీకుమూలపదం ఉంది. ఒక్క కల్చర్ అన్న మాటే లాటిన్ పదం. ఇటలీ వారు కానీ, ఫ్రెంచి వారుకానీ, ట్యూటన్ జనంకానీ, ఆంగ్లో శాక్షనులు కానీ, మన అందరికీ-యూరపులో మన అస్తిత్వానికి, తమ స్థానానికి గ్రీకో-రోమన్ కులగోత్రాలు, ఆ వంశ పారం పర్యమే ముఖ్యహేతువు.

అసలు యూరపు అన్న పేరే ఆదిలో "మధ్య గ్రీసు" అన్న అర్థంలో వ్యవహరింపబడేది. యూరపు అన్నమాట వ్యుత్పత్తి "బాగుగా నీరు పారునది" అనే దానివల్ల కలిగిందా, లేక "లావుపాటి ముఖం గలది" అనే దానివల్ల ఏర్పడిందా అన్న విషయంలో శబ్ధ వుత్పత్తి శాస్త్రజ్ఞులలోనే భిన్నాభిప్రాయాలున్నాయి ఈ రెండింటిలో ఏదీ యుక్తమైనదిగా కన్పట్టదు. క్రమేణా యూరపు అన్నమాట యావత్తు గ్రీసు ప్రధాన భూభాగానికి వర్తింపు చేయబడింది. క్రీ॥పూ॥ 500 నాటికల్లా గ్రీసుకు వెనుక ఉన్న భూభాగాని కంతటికీ అది వర్తించింది. జ్యూస్(గ్రీకు దేవేంద్రుడు) ఆబోతు వేషధారణతో ఐరోపా అనే బాలికను అపహరించి క్రెటే అనే ప్రదేశానికి తీసుకుపోయాడని ఒక పురాణ గాథ ఉంది. ఆ బాలిక టైర్ లేదా ఫినీషియాలో మరే ప్రాంతానికో చెందినది. యూరోపియన్ కల్పనా సాహిత్య సంప్రదాయంలో తత్సంబంధమైన పితృియంలో గ్రీకు పురాణగాథలు, కట్టు కథలు ఒక భాగమై ఉన్నాయి. మనం యూరోపియనులమని చెప్పుకుంటున్నామంటే, యూరోపు విషయాలను గూర్చి యూరో-గందర గోళాన్ని గూర్చి వచ్చీ రాని మాటలు వల్లిస్తున్నామంటే గ్రీసుకు మనమెంత ఋణపడి ఉన్నామో చెప్పుకుంటూ ఉన్నామన్న మాట.

సాంస్కృతిక వారసత్వాన్ని గూర్చిన చర్చలలో నిర్దిష్టమైన ఉదాహరణలు పేర్కొనడం కన్నా సభక్తికంగా స్తోత్రం చేయడం సులభం. ప్రతి ఒక్క తరం తనకు కావలసిన దానిని తన గ్రీకు పూర్వీకులలో కనుగొంటుంది. విక్టోరియన్ తిరుగుబాటుదార్లు ప్రాచీన గ్రీసు దేశం ఒక ప్రత్యామ్నాయ సమాజాన్ని ఇవ్వగలిగిందని ఘనంగా కొనియాడారు. తన జీవితాంతమూ ఎంతో శ్రద్ధాసక్తులతో ప్రాచీన శ్రేష్ఠ మార్గావలంబి (క్లాసిసిస్ట్) అయిన కారల్ మార్క్స్ ఒక సందర్భంలో భావావేశ రూపకమైన హృదయ దౌర్బల్యంతో "మానవ సమాజానికి శైశవ దశ యైన-అంటే మానవ సమాజం అత్యధికంగా ఆకర్షణీయమైన ప్రగతిని సాధించిద దశ- ఆ తొలి దశ మళ్ళీ ఎన్నటికీ తిరిగిరాని యుగంగా ఒక నిరంతర ఆకర్షణగా ఎందుకు అలరారదూ?" అని సెంటిమెంటల్‌గా వ్రాశాడు!

విక్టోరియన్ పాలక వ్యవస్థ కూడా సెంటిమెంటల్ గానే బ్రిటిషు సామ్రాజ్యానికి తన ఆదర్శంగా ఏథీనియన్ (ఏథెన్సు నగరపు) సామ్రాజ్య వాదాన్నే స్వీకరించింది.

బ్రిటన్‌లో బహుకాలం వరకూ గ్రీకు భాషా సాహిత్యాల అధ్యయనం విద్యావంతులైన పై తరగతుల

వారి ప్రతిష్ఠ ప్రదర్శనకూ, భేషజానికీ చిహ్నంగా పరిగణింపబడింది. గ్రీకు భాషకు వ్యతిరేకంగా ఎవ్వరూ ఏమీ అనేవారు కారు. ఏమీ అనలేరు. ఆ భాషా జ్ఞానం ఉన్నదంటే చాలు, ఆ వ్యక్తి విద్యావంతుడైన సజ్జనుడుగా చలామణీ అయ్యేవాడు. 19వ శతాబ్దిలో ఆక్సుఫర్డ్ కెథిడ్రల్‌లో ఒక ప్రార్థనా సమావేశంలో ఒక మతాచార్యుని ప్రసంగంలో నుంచి ఒక వాక్యాన్ని ఇక్కడ ఉదాహరిస్తాను. "గ్రీకు సాహిత్యాన్ని అధ్యయనం చేయండని ఉద్బోధించడం కన్న నేను చేయగల సత్కార్యం మరొకటి లేదు. ఆ సాహిత్యం మిమ్ములను పామర జన సమూహం కంటె ఒక అంతస్థు పైన ఉంచడమేగాక, తరచు మంచి వేతనము లభించే ఉన్నత పదవులలో మిమ్ము అధిష్ఠింప జేయగలదు."

సరే, విక్టోరియనుల భేషజాన్నీ అంతస్థులనూ, ఆడంబరాలనూ అలా ఉంచండి. అసలు విషయానికొస్తే గ్రీకు సంస్కృతిని వారసత్వంగా పొందడాన్ని వారు కొనియాడడం మాత్రం సముచితమైన కార్యమనే చెప్పాలి, గ్రీకు వారసత్వాన్ని నేడు మనం ప్రపంచించడానిక గల కారణాలు కొన్నింటిని ఇచ్చట పేర్కొంటాను. ఈ కారణాలను కూడా రాబోవు తరాలవారు భేషజ మని కొట్టి పారవేస్తారనడంలో సందేహమేమీ లేదు. కాని ఆ కొట్టి పారవేయడమనేది గ్రీకులకు ఉండే సహజమైన ఆ గౌరవ భావం వల్లా, కొత్త దానిపై కోరిక వల్లా మాత్రమే జరుగుతుంది. ఒడిసీయుస్ (ఒడిసీ కావ్యంలోని నాయకుడు) మాత్రమే కాదు, ప్రాచీన గ్రీసు అంతా ఆకలిగొన్న హృదయంతో ఎల్లప్పుడూ దేశ సంచారం చేయడానికీ, ఆగౌరవం చూపడానికీ, దేనికైనా సరే, చివరకు జానపద నృత్యం చేయటం, వరుస కానివారితో వ్యభిచారం చేయడమైనా ఒకసారి చేసి చూడటానికీ-మారు పేరుగా ప్రసిద్ధి చెందింది.

## భాష

పత్రికా రచనలోని దోషాలుగా, అవగుణాలుగా లెక్కింప బడే ప్రథమము, సర్వోత్కృష్టము వంటి విశేషణాలపై మక్కువను విడనాడి, విషయ ప్రధానమైన పరిశీలనం చేద్దాం. గ్రీకులు అక్షర మాలను కనిపెట్టారు. అయితే వారు దానిని ఫీనిషియన్ (సిమిటిక్) మూలముల నుండి పొంది, చూడ వికారంగా ఉండే సంకీర్ణతలను తొలగించి సూక్ష్మం చేసి, దానికి అచ్చు గుర్తులిచ్చి, అద్భుతమూ, సౌలభ్యయుతమూ అయిన ఒక పనిముట్టును తయారు చేశారు.

మానవుని భావాలను తెలియ జేయడానికి రూపొందింప బడ్డ ఉత్తమ సాధనాలలో భాష ఒకటి. గ్రీకు కన్న ఇంగ్లీషులో పదజాలం ఎక్కువగా ఉంది. కాని గ్రీకు భాషకున్నటువంటి సాగేగుణము, హెచ్చు తగ్గులు లేని ఖండిత స్వభావము ఇంగ్లీషుకు లేవు. తమ భాషను వ్రాయగల సాధనం కనుగొనగానే వారు సాహిత్యం సృష్టించ గలిగారు.

## సాహిత్యం

ప్రపంచంలో ఏ నాగరికత అయినా సరే, సృష్టించిన సాహిత్యాలలో ఇంగ్లీషు సాహిత్యం అన్నిటికన్నా గొప్పదని నేడు మనం చెప్పుకుంటున్నామంటే వ్యక్తిగతమైన మన భావాలను మెతకదనం ఎరుగని విమర్శకు గురిచేస్తున్నామని చెప్ప సాహసిస్తున్నాను. మన ఇంగ్లీషు సాహిత్యంలో మంచి సరుకు కూడా ఉంది. అలాగే ఫ్రెంచి, జర్మన్, లాటిన్ భాషలలోనూ. కాని శ్రేష్ఠమైన సాహిత్యాలలో అతి ప్రాచీన సాహిత్యాలలో గ్రీకు సాహిత్యం ఒకటి. మూలంలో కాకపోయినా అనువాదం లోనైనా హోమర్ మహాకవి కృతులనూ, విషాదాంత కావ్యాలు రచించిన వారి గ్రంథాలనూ, థుసిడైడ్స్ ప్లేటో థియోక్రిటస్ తదితరుల రచనలనూ చదవలేకపోయామంటే జీవితంలో విలువైన వస్తువును దేనినో పొందలేక పోయామన్న మాట. ఇక గ్రీక్ ఏంథాలజీలోని చాటువులనూ నీతి వాక్యాలనూ

ప్రస్తావించకుండా అసలు ఉండలేము. ఆ సంకలనం నేటికీ మనల్ని గాఢంగా ప్రభావితం చేస్తోంది

మానవ జీవితంలోని విషాద దృశ్యాల్ని వ్యక్తీకరించిన కావ్యాలలో ఇలియడ్ ఆదికావ్యం. అది ఈనాటికీ సర్వోత్తమమైన విషాదాంత కావ్యం. పాశ్చాత్యులలో ఇద్దరు పురుషులు వీధిలో చేతులు చేతులు కలిసే స్థితికి చేరుకొన్నారంటే వారు హోమర్ కనిపెట్టిన సంప్రదాయాన్ని ప్రతిధ్వనింప జేస్తున్నారన్నమాట. ఆతని ఇద్దరు నాయకులు ట్రాయ్ ముందరి యుద్ధపు ఘర్షణలో ఘోషలో తలపడ్డారంటే వారిలో ఒకడు మరొకనిని సంహరించేటంత వరకూ తక్కినవన్నీ మన దృష్టి నుంచీ, శ్రవణేంద్రియము నుంచీ అంతర్ధానమవుతాయి. ఒడిస్సీ మొట్టమొదటి నవల. మన ఒక్క తరంలోనే జాయిస్‌నూ, పౌండ్‌నూ, గ్రేవ్స్‌నూ గ్రీకులు ఎంతగా ప్రభావితుల్ని చేశారో కాస్త ఆలోచించండి.

## ప్రజాస్వామ్యం

"గ్రీకులు ప్రజాస్వామ్యమును కనుగొన్నారు" అన్నది సర్వసాధారణ వాక్యం. డెమాక్రసీ అనేది గ్రీకుభాషా శబ్దము. అంటే ప్రజలు యావన్మందిచే నిర్వహింపబడే పరిపాలన అని అర్థం. కాని కొత్త వాటిని కనుగొనే స్వభావం గల గ్రీకులు రాజరికం, కొందరు పెద్దలు కూడి చేసే రాజ్యాధిపత్యం, నిరంకుశాధికారం, మూకవలన పరిపాలనం వంటి ఇతర ప్రభుత్వ వ్యవస్థను కూడా ఉపజ్ఞచే కనుగొని వాటికి తగు పేర్లు కూడా పెట్టారు. ప్లేటో, అరిస్టాటిల్, ఇంకా ఇతరులు ప్రజాస్వామ్యాన్ని మూక పరిపాలన అనీ, అది విపత్కరమైనదనీ తిరస్కరించారు, మరి ఆ మహనీయుల అభిప్రాయాలను మహితోక్తులుగా ఎందరో నేటికీ మన్నిస్తున్నారు. అయినా సోలాన్ మొదలు పెరికిల్స్ వరకు ఒకటిన్నర స్వర్ణ శతాబ్ది కాలంలోనే ఏథీనియనులు నగరవాసులు యావన్మందీ ఒకచోట సమావేశమై రాజ్యా వ్యవహారాలను నడిపే విధానానికి రూపకల్పన చేసి, మరి దానిని అమలు జరిపారు.

యథార్థానికి అది సంపూర్ణమైన ప్రజాస్వామ్యం కాదు. స్త్రీలకు, బానిసలకు, పిల్లలకు, అస్యులైన పరదేశీయులకు అందులో స్థానంలేదు. నిజానికి అది కన్నీటితో పర్యవసానం చెందింది. కాని ఆ స్వర్ణయుగపు రాజకీయ ధర్మాలు నేటికీ పాశ్చాత్య ప్రజాస్వామ్య ఆదర్శాలకు ఉత్తేజం, స్ఫూర్తి ఇస్తున్నాయి.

పెలో పొన్నీషియన్ యుద్ధం మొదటి సంవత్సరంలో నిహతులైన ఏథీనియనుల అంత్యక్రియల సందర్భంలో పరికిల్స్ ఒక ఉపన్యాసం చేశాడు. అతను చెప్పిన దానిని చక్కగా అనువదించడం అసాధ్యమైన కార్యం. కాని థుసిడైడ్స్ చెప్పిన దానిని బట్టి ఆ ప్రసంగం ఈవిధంగా ఉన్నది: అది కూడా సమగ్రం కాదు.

"మన పరిపాలనా విధానం ఇతరులను అనుకరించదు. మనది ఇతరులకు ఒక ఉదాహరణగా ఉంటుంది. మనం దీనిని ప్రజాస్వామ్యమని అంటున్నాము. ఎందుచేతనంటే అధికారమనేది కొందరు శిష్టుల చేతుల్లో లేదు. అధి కారులందరి హస్తగతమై ఉన్నది. శాసనం ముందు అందరూ సమానులే. ఒక మనిషి ఒక పనిలో ప్రవీణుడైతే అతడు ఏ తరగతికి చెందినవాడన్న ప్రశ్న అప్రస్తుతమైనది- తన యోగ్యతలను బట్టే అతడు ప్రజాజీవితంలో ఉన్నతి పొందుతాడు. అతడు పేదవాడైనా ఫరవాలేదు. రాజ్యానికి అతడు కొంతసేవ చేయగల సామర్థ్యం కలవాడైతే, అతనికి అట్టి అవకాశం మనం కలుగ జేస్తాము."

కుంటుతూ అనువదించినా పరిక్లీయన్ ఆదర్శాలు, మనలో చాలామంది నేటికాలంలో నిర్వహిస్తూ ఉన్న ప్రజాస్వామ్యాల ఆదర్శాల కన్న ఉత్తమంగానే ఉన్నాయి.

## తత్త్వ శాస్త్రం

గ్రీకులు తొలి తాత్త్వికులని చెప్పడం సర్వ సాధారణంగా వినపడే మరొక మాట. సర్వ ప్రసిద్ధమైన మాటలన్నిటివలెనే ఇది కూడా కొన్ని టీకా తాత్పర్యాలకు లోబడిన యధార్థం. మానవుడు ఈ జగత్తుకు వివరణమూ చేయగలడు, దీనిని మార్చనూ గలడు అని గ్రీకుల విశ్వాసం. క్రీ. పూ. 500 ప్రాంతం వాడైన హెరాక్లిటస్ ఉవాచ: "సమస్తమూ నిరంతర పరివర్తన స్థితిలో ఉన్నది. ఎడతెగకుండా పరివర్తనం చెందుతూ ఉన్న ఈ జగత్తులో నిర్వికల్పమైన, స్థిరమైన, హేతుబద్ధమైన ఒక సూత్రమున్నది-ఆ సూత్రానికి అన్నీ లోబడి ఉన్నవి. ఆచారాలూ, మూఢవిశ్వాసాలూ మున్నగు వాటిని తొలగించి హేతువును సుప్రతిష్ఠితం చేయవచ్చు."

మానవ నిర్మితములైన శాసనాలను ఆమోదించిన వారిలో గ్రీకులు ప్రథములు. అట్టి శాసనాలను హేతువాదంతో, వాద ప్రతివాదాలతో మార్చవచ్చు. "అన్యాయానికీ అక్రమానికీ పాల్పడటానికిగానీ, లేక వాటికి గురికావడానికి గానీ తావు లేని విధంగా ఒకరితో మరొకరు సాంఘికమైన ఒప్పందము చేసుకోవడమే మానవులమధ్య ఏర్పడే అన్ని శాసనాలకూ ఒడంబడికలకూ, కట్టడులకూ మూలము" అని 'ది రిపబ్లిక్' అనే గ్రంథం చెబుతున్నది.

సకల విషయాలకూ కొలమానం మానవుడే అన్న విశ్వాసమూ, బౌద్ధికమైన జిజ్ఞాస, కొత్త అంశములను కనిపెట్టే గుణమూ-ఇవే "తత్త్వము"నకు సంబంధించిన కొత్త శాస్త్రాలైన వైద్యము, ఖగోళ శాస్త్రముల వైపుకు గ్రీకులను మళ్ళించాయి. ఆ రంగాలలో వారు వెయ్యేళ్ళపాటు ప్రాబల్యం వహించారు. వైజ్ఞానిక విషయాలలో అధికారుల ఆజ్ఞలకు శిరసావహించడానికి వారు నిరాకరించడం యూరపు సంస్కృతిలో ఉత్తమోత్తమ సంప్రదాయమై భాసిస్తూ ఉన్నది. అప్పటి గ్రీకుల భాష అధిక పటుత్వం కలదై, ప్లేటో భాషకన్న తక్కువ మెరుగు, తక్కువ నాజూకుదనము కలదైనప్పటికీ గ్రీకులు అంతటి ప్రాచీన కాలంలోనే సాహసించి అడిగిన కొన్ని గొప్ప ప్రశ్నలను మన తాత్త్వికులు నేటికీ పరామర్శ చేస్తూనే ఉన్నారు.

## కళలు

ప్రాచీన గ్రీకు కళ యొక్క ముఖ్యప్రభావం వాస్తుశాస్త్రం, శిల్పం వంటి విద్యలపై ఉన్నది, ఫ్లారెన్స్ నగరంలో ఒక గ్రీకు కట్టడపు అనుకరణముతో రినేశాన్స్‌కు (పునరుజ్జీవనానికి) అంకురార్పణ జరిగింది. యూరపు పునరుజ్జీవనము, గ్రీకు ప్రాచీన శ్రేష్ఠసాంస్కృతిక పునరుద్ధరణము మూలంగా బ్రిటనులో నిర్మింపబడిన కట్టడాలు ఆధునిక వాస్తుశాస్త్రజ్ఞులకు అపకీర్తిని తెచ్చేవిగా, నిందార్హమైనవిగా ఉన్నాయి

గ్రీకులు మొదట రాతిక్రిందగల కండపుష్టిని గమనించి ఈజిప్షియన్ లేక అస్సీరియన్ పాలరాతి బాలుని నుంచి పాలరాతిలో బాలుని సృష్టించేవరకూ పురోగమించారు. జాడీలపై, రాతిపాత్రలపై, వారి సూక్ష్మ వర్ణచిత్ర రచనలు ఎంతో అందంగా వింతగా చూడ వేడుకగా ఉంటాయి. వాటిలో పౌరాణిక సంపద ఉంది. కాలసూచన ఉంది. ఎంతో గొప్పవైన భిత్తి చిత్రాలు విస్మృతి గర్భంలో కలిసి పోయాయి. వర్జినాలో మాసిడన్ రాజవంశీయుల సమాధులపై కనుగొనబడిన నాల్గవ శతాబ్ది తాలూకు అందాలు-మనం పోగొట్టుకున్న కళాసంపద ఎటువంటిదో చూపే మచ్చుతునకలు. అయినా కళారంగంలో గ్రీసుల సంప్రదాయం రోము ద్వారా తరతరాలకూ అందుబాటులోకి వచ్చింది. ఆ సంప్రదాయం పిసానో, గియాటో మొదలు ఇన్‌గ్రెస్ ఇంకా ఆ తరువాతివారి వరకూ అపరిమితంగా ప్రభావాన్ని బరపింది. మినోటౌర్ (ఒక గ్రీకు పౌరాణిక రాక్షసుడు) పికాసోను వదలకుండా ఆయన మనస్సును ఎంతగా ఆక్రమించాడో ఒకమారు జ్ఞాపకం చేసుకోండి.

## పురాణాలు, కట్టు కథలు

ఒడిస్సిస్‌యవలెనే గ్రీకు సంస్కృతి కూడా బహు ముఖమైనది. దాని కెన్నో ప్రత్యామ్నాయాలు- ఎన్నో శిఖలు, లాగాన్ (భూలోకమునకు అవతరించిన దేవుని మాట)తో, కాస్మాస్ (వ్యవస్థిత విశ్వము)తో జగత్తును గూర్చిన హేతు యుక్తమైన దృక్పథం వివేకరహితమై అసంబద్ధమై పోయింది. గ్రీకు పురాణాలు కట్టు కథలు తరువాతి తరాలవారి భావనాశక్తిని ఎంతగా ఆకట్టుకున్నా యంటే గ్రీకు పురాణాలు,గ్రీకుల కట్టు కథల పరిజ్ఞానంతగి నంతగా లేక పోతే పశ్చిమ యూరపు సాహిత్యాన్నీ కళలనూ, అర్థం చేసుకోవడం సాధ్యం కాదు. అట్టి పరిజ్ఞానం లేక పోతే మనల్ని మనమే అర్థం చేసుకో లేమని కొందరు మన తత్వ శాస్త్ర వేత్తలు అంటారు.

ఈ తరగతులు, వర్గములు అన్నీ బలవంతంగా ఒక ప్రమాణాన్ని ఏర్పరచడానికి ఉద్దేశింపబడినవనీ, అసంపూర్ణమైనవనీ నేనూ అంగీకరిస్తాను. పత్రికా రచన అనివార్యంగా మరీ సూక్ష్మం చేయబడి, లోతు లేని పై వ్రాతగా తయారైందని అనుకున్నా, అది క్రీ॥ పూ॥ 800 నుంచి 800 వరకూ గ్రీసులో ఉంది. అప్పుడు గ్రీసు దేశంలో, ముఖ్యంగా ఏథెన్స్ నగరంలో మానవుని సృజనాత్మక శక్తి అద్భుతంగా సాగింది. దానిని రోమనులు మనకు చేరవేశారు చేర వేస్తూ దానిని కొంత మార్చారు. రోమ్ పతనానంతరం బిజాన్ టిన్‌లు ఆ అమూల్య సంపదను పదిశతాబ్దాల పాటు పరిరక్షించారు. గ్రీకులాగాస్, క్రైస్తవ శ్రుతి ప్రకాశము రెండూ సమ్మేళనం చెందడంవల్ల మానవుడు కనుగొన్న మతాలలోకెల్లా ఉత్తమమైన మతం ఆవిర్భవించింది, అది రినేశాన్స్ (పునరుజ్జీవనము)ను సాధించింది, మనం దానికి అవకాశమిస్తే అది మనల్ని మరల మరల ఉజ్జీవింప జేస్తూనే ఉంటుంది,

యూరపియనులమైన మనం ఈ క్రింది గుణగణము లున్నప్పుడు గ్రీకుల మవుతాము = "ఎందుకు?" "ఎందుకు కాదు?" అన్న ప్రశ్నలు అడిగే స్వభావం. స్ఫుటమైన ఉచ్చారణ చేయగలగడం; కొత్త వాటిని కనిపెట్టడం; మన అభిప్రాయాలకు మనం పట్టుదలతో, హఠముతో కట్టుబడి ఉండటం, లేదు కాదు అనే సమాధానాలతో సంతృప్తి చెందకుండా ఉండటము; సర్వోత్తములుగా ఉండుటకై సదా పోటీ పడటము; తక్కిన వారికన్న మిన్నగా విశిష్టులుగా ఉండటము; సకల విషయాలకూ మానవుణ్ణి కొలమానంగా చేయడం మన ప్రత్యేక వ్యక్తిత్వమును నిలబెట్టు కొనుటకు తీవ్రప్రయత్నం చేస్తూనే సర్వమానవులూ సమానులనీ అంతా కష్టపడటానికే పుట్టారనీ గుర్తించడము; ఒక సిద్ధాంతాన్నిగాని లేక అభిప్రాయాన్నిగాని సులభంగా విశ్వసింపకుండా ఉండటము; మత మంటే శ్రద్ధా సక్తులు కలిగి ఉండడము. ఇవి లేనినాడు మనం యూరపియనులమే కాము. అయితే అట్టి ప్రమాదమేమీ లేదు. కాని ప్రస్తుతం మనం చేయవలసిందల్లా మన మూలములను, మన పునాదులను ఒక మారు జ్ఞాపకం చేసుకోవడం, శ్రమించి పని చేయడం, అన్వేషించడం కనుగొనడం, దేనికీ లొంగిపోకుండా ఉండటం; మనకు ఆధారాలైన మూలములను గూర్చి వాదించడం, చర్చలు జరపడం. కెనడా దేశకవి క్లారెన్స్‌డే ఒక కవితలో ఇలా అన్నాడు:

యుగాలు అంతరించినప్పుడు
వాటి వారసత్వపు ఆస్తి
కొత్త పోలీసులకు అప్పగింత అవుతుంది;
గ్రీసు పురావైభవాన్ని
న్యూ ఇంగ్లండు ఆచార్యులు పరిరక్షిస్తారు.

అయితే ఆ వైభవం ఎల్లప్పుడూ ఉండేదే-చర్మం క్రింద, శబ్దాలవెనుక. రాజకీయాలకు ఆవల....

అనువాదం: డి. రామలింగ.
(లండన్ టైమ్స్ పత్రిక సౌజన్యంతో)

డి. రామలింగం
1-8-726/30, నల్లకుంట,
హైదరాబాదు-44.

# సాహిత్యగోష్ఠి

## శృంగార శాకుంతలం
## పిన వీరనతనం

ఇంద్రగంటి భానుమూర్తి

మంచిగంధం చెట్టు పూలు పూయదు; పరిమళిస్తుం దంటే. ఇక, సువర్ణానికి వర్ణమే గాని సువాసన అనేదే లేదు గదా! చెరకుగడ ఆద్యంతమూ రసమధురంగానే ఉంటుంది. కాని, దానికి పండు పండడమంటూ ఉండదు. ఒకవేళ, చందనవృక్షం వన్నెచిన్నెలతో అందమైన పువ్వేపూస్తే, పచ్చబంగారానికి, ఒకవేళ పరిమళమే, అబ్బితే, చెరకుగడే అతి మధురంగా ఫలిస్తే — ఎలా ఉంటుందో అలా ఉందట — శకుంతల మేన వికసించిన యౌవనం! దుష్యంతుడు తొలిసారిగా పడుచు శకుంతలని చూసినపుడు అనుకుంటాడు, ఇలా_

"చందనంబున పుష్పంబు, కుందనమున
పరిమళం బిక్షులతికను ఫలమువోలె
రతి మనోహరమైన యీ యతివ మేన
వరయ గనుగొంటి గాదె యీ యౌవనంబు!"

కాళిదాసమహాకవి శకుంతలను "అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహైః" అని అంటే, గేథే కవి, ఈమెను, వసంత గ్రీష్మాల పుష్పఫల శోభగా భావిస్తే, పిన వీరన ఈ శకుంతల పడుచు దనానికి ఒక కొత్తరంగునీ, రుచినీ, సువాసననీ కల్పించినాడె అని ముచ్చటౌతుంది, శృంగార శాకుంతలంలోని ఈ పద్యం స్ఫురణకు వచ్చినప్పుడల్లా.

శకుంతల అవగానే సంస్కృత వ్యాసేతిహాసంలోని దుష్యంతోపాఖ్యానం, నన్నయగారి తెలుగుసేత, కాళిదాస అభిజ్ఞాన శాకుంతలం చప్పున గుర్తుకువస్తాయి. స్త్రీని ఒక విలాసవస్తువుగానే భావించి, వర్తించి తరువాత ఏమీ ఎరుగనట్టు ప్రవర్తించేవారి కథను జరిగింది జరిగినట్టు సంస్కృతేతిహాసం చిత్రిస్తుంది. నన్నయ్యగారు తమ కవితా ప్రతిభతో దానికి ఒక గాంభీర్యం సంతరించారు. అడవిమల్లె లాంటి ఈ అమాయక సుందరి దయనీయ కథ కాళిదాస మహాకవిని ఆకర్షించింది. యువతి సహజమయిన యౌవనావేశపు పొంగు ఒకవైపూ, వ్యక్తిత్వవైశిష్ట్యం ఇంకొకవైపూ ఈమె మనస్సును కల్లోల పరచిన తీరును మహాకవి నిశితంగా పరిశీలించి యౌవనపు పొంగులోనిది ప్రేమ గాదనీ, ప్రేమ విరహ తపస్సులోనే ఫలిస్తుందనీ, దాంపత్యధార్మికోదాత్తశృంగారమహితంఅయినప్పుడే రాణిస్తుందనీ, నూతన కల్పనలతో, ఈమె కథను పవిత్రప్రేమ వ్యాఖ్యానంగా అభిజ్ఞాన శాకుంతలం చేశారు. ఇక, పినవీరన, కాళిదాస నాటకపు కలిమినీ, నన్నయ దుష్యంతోపాఖ్యాన మేలిమినీ మేళవించి తన మార్పును జోడించి ఒక కథా పథకం సిద్ధం చేసుకొన్నాడు. భరతుడి పుట్టుక తరువాత సభలో దుష్యంతుడు శకుంతలను స్వీకరించడం— అనే అంశాన్ని భారత కథానుగుణంగా గ్రహించాడు. జింకవేట, శకుంతలా దుష్యంతుల ఆశ్రమవన సమావేశం, కణ్వుని సోమతీర్థగమనం, యాగ రక్షణకోసం దుష్యంతుడు కణ్వాశ్రమంలో కొంత కాలంపాటు ఉండి పోవడం, దుర్వాసశాపం — ఈ అంశాలను కాళిదాసు నాటకానుగుణంగా స్వీకరించాడు. మేనకా విశ్వామిత్ర కథ ముని శిష్యుడిచేత దుష్యంతునికి చెప్పించడం, అనసూయా ప్రియంవదలు రాజసభకు వచ్చి ప్రముఖ పాత్ర వహించడం — వంటి మార్పులు కొన్ని తాను చేశాడు. ఈ ముప్పేటల అల్లికతో కావ్య కథా

నిర్మాణం చేసుకోవడంతో శృంగార శాకుంతల కావ్య కథకు కొంత శైథిల్యం వచ్చింది. దుర్వాసశాప వృత్తాంతం సమస్తమూ తెలిసిన అనసూయే, రాజ సభలో దుష్యంతుడి మరపు మాటలు విని విపరీతమైన కోపంతో దుష్యంతుడు శకుంతలకు బహూకరించిన అంగుళీయకాన్ని విసరివేయడం వంటివి ఇందుకు నిదర్శనాలు. కావ్య సౌందర్యానికి ఆధారభూమి కథా పథకం. దీని శైథిల్యపు నీడలు, ఇందులో దుష్యంతుడు అనసూయలపై చెదరి కావ్యశిల్పంపై పడ్డాయి.

అయితే, పిన వీరన విశిష్టత అంతా కాళిదాసుని కవితాత్మక నాటక వృత్తివిశేషాల ను "అభినవ శ్రీ వహింప" మలచుకోవడంలోను, రచనను రసమధురం చేయడంలోను ఉంది. నాటక సన్నివేశాన్ని గాని, స ఘటనను గాని సంభాషణను గాని దేనినయినా రేఖా మాత్రంగానే గ్రహించి దానికి స్వీయ ప్రతిభాను సారంగా ఒక కొత్తరూపు తెచ్చాడు. శృంగార చిత్రణంలో తన "తృతీయఃపంథ"తనుఅవలంబించాడు. ఇది మూలంగా పిన వీరుని కావ్యం, కాళిదాస దృశ్య కావ్యంలా మనోజ్ఞ సందేశ విశిష్టం కాకుండా, ఒక శృంగార బంధుర ప్రబంధంగా వన్నెకు వచ్చింది.

అభిజ్ఞాన శాకుంతల రూపక తృతీయాంకంలో — శకుంతల, ఆశ్రమవనం లోని ఒక పొదరింట విరహ శయ్యపై ఉండి అనసూయా ప్రియంవదలకు మన్మథ లేఖ వినిపిస్తూంటుంది. దుష్యంతుడు వస్తాడు. వెంటనే తను ససంభ్రమంగా లేచి నిలబడుతుంది. అపుడు దుష్యంతుడు —

"సందష్టకుసుమ శయనాన్యా
క్లాంతబిసభఙ్గ సురభీణి
గురుపరితాపాని నతే
గాత్రాణ్యుపచార మర్హన్తి॥"

అని అంటాడు. శృంగార శాకుంతలంలోని ఇంచు మించుగా ఇలాంటి సందర్భంలోనే దుష్యంతుడు వస్తాడు, శకుంతల లేచి నిలబడుతుంది. పక్కమీదనుండి లేచి నిలబడిన శకుంతల బొమ్మను పిన వీరన ఊహతో కట్టిన తీరు ఇది,

"అరతిఁ బోడిసెజ్జ
చిగురాకులు పైపయి నంటియుండగా
గీరముఖారు ణచ్ఛవిని
గెల్చి తనర్చిన యంగజాతు శృం
గారపుఁ దోటలోని
నవకల్పకవల్లి యొ యంచు రాజు నిం
పారఁగఁ జూచుచుండె
మధురోల్లస ముగ్ధములైన చూపులన్."

కాళిదాస రచనలోని రసరేఖ ఇంకొకటి — దుష్యంతుణ్ణి పొదరింట ఒంటరివాణ్ణి చేసి శకుంతల గౌతమితో ఆశ్రమంలోకి వెళ్ళిపోతుంది. తరువాత దుష్యంతుడు ఆమె విడిచి వెళ్ళిన పుష్పశయ్యను, తామరతూడు కంకణాన్ని, మదనలేఖను ఆప్యాయంగా చూస్తూ అనుకుంటాడు—

"తస్యాః పుష్పమయీ శరీరలులితా
శయ్యాశిలా యామియం
క్లాన్తో మన్మథలేఖ ఏష నలినీ
పత్రే నఖై రర్పితః
హస్తాద్భ్రష్ట మిదం బిసాభరణ
మిత్యాసజ్యమానేక్షణో
నిర్గన్తుంసహసా న వేత
సగృహాచ్ఛక్నోమి శూన్యాదపి॥"

దీనిని పెంచి పినవీరన శృంగార బంధురం చేసిన తీరు- కాళికాముఖ రాక్షసుని జయించి వస్తాడు దుష్యంతుడు. పొదరింట శకుంతల విడిచి వెళ్ళిన పూలపాన్పును చూస్తాడు. అప్పుడతడు పట్టలేని తమితో చేసేచేష్టలు-

"చెలువ బాహ్పముల విచ్చిన కల్వపూబంతు
లందంద కన్నుల కద్దుకొనుచు,
వనిత యూర్పుల వాఁడి వత్తలైన పయోజ
ముకుళంబు లొత్తివి మూరుకొనుచు,
న వివద మైసెకదాకి యులిసిన బిసలయ
వళిహారములు మేనవైచి కొనుచు,
రమణి డెందంబు వేఁడిమి మాఁడిమసియైన
పుప్పొడి మెయి నిండ బూసికొనుచుఁ
బోలఁతి సంతాప భరమునఁ బొరలు వెట్ట
నెండి యొరగళ్ళు వోయిన యిగురుబాన్పు
మీఁదఁ బొరలుచు, విరహాగ్ని నీఁదుకొనుచుఁ
జిత్తజోన్మాదవృత్తి సాక్షితి వరుండు!"

మరొక సల్లాపశకులం–రూపకత్రుతీయాంకంలో ప్రియంవద దుష్యంతుడితో "అపన్నస్య విషయ వాసినః జనస్య ఆర్తిహరేణ రాజ్ఞా భవితవ్యమితి నన్వేష వో ధర్మః । తేనహి ఇయంవః ప్రియ సఖీత్వామే వో ద్దిశ్యేదను వస్థాన్తరం భగవతా మన్మథేనారోపితా"

దీనిని తీసుకొని పిన వీరన వేరొక విభ్రమరీతిలో రాజుమీదికి త్రిప్పి శృంగారమహితం చేస్తాడు.

అనసూయ రాజుతో "మారుడనే చోరుడు మా శకుంతల మానధనం దొంగిలించి మీకిచ్చాడు. అతడును మీ దగ్గరే ఉన్నాడు. రాజులు స్త్రీధనం పరిగ్రహించరు గదా! ఆమె సొమ్ము ఆమె కిప్పించి మదనుణ్ణి శిక్షించండి. రాజు కర్తవ్యం నిర్వహించండి." అంటుంది. అందుకు దుష్యంతుడు "మన్మథుడు మా ధైర్యధనం దొంగిలించి మీ చేతి కిచ్చినాడు, నాకీ సంగతి కోకిల చెప్పింది. తన గుట్టిలా బయట పడడంతో మన్మథుడు మీ సఖి హృదయధనం మా దగ్గర కుదువ పెట్టినాడు, మీ కంగీకారమైతే ఇప్పుడు ఎవరిది వారు మార్చుకొని తీసు కోవచ్చుగదా!" అంటాడు. అభిజ్ఞానశాకుంతలంలో కాళిదాసు మదనలేఖా సన్నివేశం ఒక్కటే మార్చి శకుంతలా దుష్యంతుల పునస్సమాగమాన్ని రసబంధు రంగా వర్ణిస్తాడు... మేనకా విశ్వామిత్రం కూడా ఇలాగే బాగా పెంచి శృంగార బంధురం చేస్తాడు. ఇట్లా ఇతడు వర్ణనాత్మక ప్రబంధ రచన కనుగుణంగా శృంగార చిత్రణం చేస్తాడు.

కాళిదాస శాకుంతలంలో కవితా పరంగా చతుర్థాంకం, నాటకీయ సన్నివేశపరంగా పంచమాంకం, చాలా గొప్పవి- కాని పినవీరన, శాకుంతలాన్ని చతుర్థాంకం వరకే స్వీకరించి తరువాత కథను భారతాను గుణంగానే సాగించాడు. తన కథా విధానాన్ని బట్టి పంచమాంకం విడిచివేసాడు. చతుర్థాంకంలో కూడా కాళిదాసు సూక్ష్మంగా చెప్పి విడిచిన వాటిని గ్రహించి వానిని పెంచి వర్ణించాడు. శకుంతల అంపకపు వేళ మహాకవి చేసిన వర్ణనలను అక్షరశః పిన వీరన గ్రహించలేదు కాళిదాసీయంలో కణ్వుడు అత్తింట శకుంతల మసలుకోవలసిన తీరును "శుశ్రూష స్వగురూన్ ... ...." అని సూక్ష్మంగా చెప్పి వదిలితే, పిన వీరన ఈ కణ్వోపదేశాన్ని చాలా పెంచాడు. ఒక తెలుగు ఆడపడుచుకు ఆమె తండ్రి అత్తింట మసలుకో వలసిన తీరు లన్నిటినీ బోధించినట్లుగా కణ్వుడిందులో బోధచేస్తాడు. పిన వీరన, శకుంతలకు కణ్వుని మీదా, ఆశ్రమం మీదా గల గాఢాభిమానాన్ని మాత్రం రస వంతంగా చిత్రించినాడు కాని, శాకుంతలం నాటకం లోని అప్పటి ప్రకృతి ప్రతి స్పందనను పరిపూర్తిగా స్వీకరించలేదు. కాళిదాస రూపకాన్ని గ్రహించినా అందులో తనకు కావలసిన మెరుగులను మాత్రం ఉప యోగించుకొన్నాడు. అలాగే, నన్నయ దుష్యంత చరిత్ర లోని ప్రసన్న కవితా రేఖలనూ, రుచిరార్థ సూక్తులనూ సంగ్రహించాడు. "విపరీత ప్రతి భాష లేమిటికి నుర్వీనాథ ! ... ..." అన్న నన్నపార్యుల పద్య భావం గ్రహించి, దానికి మెరుగులు దిద్ది, గాథ వర్ణాలద్ది "సచ్ఛందనంబు కంటెం జందనంబునం గల ... ..." అంటూ పుత్రాలింగన సౌఖ్యాన్ని ఒక సీసపు మూసలో పోసాడు. భారతంలో శకుంతల రాజుతో "సతి, గుణవతి, ప్రజావతి, అనువ్రత అయిన ఇల్లాలిని భర్త అవజ్ఞాదృష్టితో చూస్తే అపతికి ఇహ పరములు కలుగవ" ని అంటుంది. పిన వీరన, ఈ రుచి రార్థాన్నే "గుణవతియు, పుత్రవతియు, కులవతియును నైన భామను విడుచు నన్యాయకారి కిహపరములు గలుగ" వంటూ పునరుద్ఘాటించాడు. ఇట్లా పిన వీరన కాళిదాసు, నన్నయల రచనలలోని కలిమినీ, మేలిమినీ స్వీకరించినా ప్రముఖంగా తన తనాన్ని ప్రదర్శిస్తూ తన మూడవ మార్గాన్ని తాను వేసుకో యత్నిస్తూనే వచ్చాడు

దర్శన ప్రజ్ఞ కలిగి ఉండడం ఒక ఎత్తు. దర్శించిన దాన్ని మనోజ్ఞ వర్ణ చిత్రితం చేయడం ఇంకొక యెత్తు. రెండవది బలంగా చేయగలవాడే "కవి" గా నిలబడతాడు. పిన వీరన లోని కవితాంశ విలక్షణ మైంది. ముఖ్యంగా ఇతని మాటకూర్పులో ఒక క్రొత్త తళుకు ఉంది. మునీంద్రుల శాప తాపాన్ని దృష్టిలో పెట్టుకొని "నాలుక వెచ్చని మునులకు" అంటాడు. శకుంతల విమల దంతాలు "విరిమించు మొగ్గల"ట "కన్నులాకలి" తీనిదట శకుంతలా సౌంద ర్యం. విరహిణి శకుంతల "వెన్నెల వడగొట్టినట్లు" విరహంతో బడలి ఉందట. చేసే వర్ణనంలో కూడా

ఒక చిత్రమైన మారుపడి ఉంటుంది. చంద్రోదయం అయింది ఆ ఉదయించిన చంద్రుడు "జ్యోత్స్నా వర్షి వర్షా పయోదః" వెన్నెల జల్లు కురిసే వాన మబ్బట చంద్రుడు.

శృంగార శాకుంతలంలోని వ్యక్తులు మనవారే అని పిస్తారు. ఇందులోని కణ్వుడు అమాయక సరళ హృద యుడైన ఒక తెనుగింటి తండ్రి- మునివాటిక లోని ఒక మహా తపస్విగా అనిపించడు ఇక శకుంతల పరిమళిం చడమే తప్ప మాటాడడం ఎరుగని ఒక మూగ మల్లె పువ్వు. చెలికత్తెల తోనే గాని ఇక ఎవరితోనూ మనసు విప్పి మాటాడదు. ఇష్టమైతే విభ్రమంగా చూస్తుంది కష్టమైతే కన్నీళ్ళు పెట్టుకొంటుంది— అంతే ఒక్క దుష్యంతుడు మాత్రం గాంభీర్య ప్రకృతిలో తప్ప మిగి లిన విధాల కాళిదాస దుష్యంతుడే. రూపకంలో వలె కాకుండా ఇందులో అనసూయా ప్రియంవద లిద్దరూ శకుంతల బరువు బాధ్యతల్ని తమవిగా స్వీకరించి నిర్వ హించిన ఆత్మీయ బంధువులుగా కనిపిస్తారు.

భట్ట బాణాది మహాకవుల సంస్కృత కావ్య ప్రపం చాన్ని మథించి వారి వక్రోక్తిచాతురిని మనసుకు పట్టించుకున్నవాడు పినవీరన. అంతేకాదు— నన్నయ ప్రౌఢ ప్రబంధ వాసనా సంపత్తీ, తిక్కన వాక్శిక్షా మోదమూ, నాచన సోమన వాచామహత్త్వమూ, శ్రీనాథుని భాషా నిగుంభన పరిమళమూ బాగా ఆక ళించుకొన్న వాడూను. ఈ సంస్కృతాంధ్ర కావ్య భావితమైన చిత్త సంస్కారంతో ఒక కొత్త రసాయ నంలా తన ప్రబంధ రచనను తయారు చేసాడు. ఈ మేళవింపుతో చక్కంగా, చిక్కంగా తయారైన ఇతని వర్ణనాధోరణీ, వక్రోక్తి పటిమా తరువాత వచ్చిన పెద్దనాది కవులకు ఆరాధ్యమై ప్రబంధ ప్రక్రియకు ఓరవడు లయాయి.

చిత్రమేమిటంటే శ్రీనాథ కవి బుద్ధి జాతి వంటిదే ఇతనిదీని. ఇతడూ శ్రీ నాథుడి లాగే శబ్దం వైపు మొగ్గి నన్నయ పీఠానికి చెందినవాడు. కనుక అప్రయ త్నంగా శ్రీనాథుడి ఆకర్షణ వలయంలో ఇతడూ పడి పోయాడు, సీస రచనలో, కావ్య శ్లోకానువాద రీతిలో శృంగార ప్రియతలో— ఎన్నో విధాల-ఇంతెందుకు— శ్రీనాథుడిది శృంగార నైషధమైతే. ఇతడిది శృంగార శాకుంతలం అయింది గదా ! అందుచేత శ్రీనాథ మహా వృక్షం ముందర ఇతడు పిల్లలమట్టి అయిపోయాడు. ఆ మహాకవి పీరుని ముందు ఇతను పినవీరనగా మిగిలిపోయాడు.

అయితే ఒక్కమాట— "వాణి నా రాణి" అన్న తెలుగు కవి పిన వీరన. తన కృతికి ఒక వేళ పరిమళం కొరవడితే వాగ్దేవి "తన విభ్రమ శ్రవణ కల్హారో దయా మోదముల్ ఇచ్చుగాక!" అని అన్నవాడూను. అలాగే తన శృంగార శాకుంతలానికి ఒక కొత్త ఆమో దాన్ని తెచ్చుకొన్న వాడూను.

ఇంద్రగంటి భానుమూర్తి
9-27-741 కావలి.

* * * *

# కావ్య లోకంలో వేసవి కాలం

ఈ లోకంలో వేసవి కాలం ఎలా వుందో మనకు తెలుసు. కావ్యలోకంలో అది ఎలావుందో ఇప్పుడు పరి శీలిద్దాం. కావ్య లోకం అన్నప్పుడు 1100-1600 సంవ త్సరాల మధ్య కాలం లోని కావ్యాలనే గ్రహిస్తున్నాను.

పాండవు లింద్రప్రస్థ లో వున్నారు. ద్రౌపదీ సుభద్రలకు పుత్రులు పుట్టారు. పిమ్మట గ్రీష్మారంభం అయింది. అప్పుడు కృష్ణార్జునులు యమునా తీరానికి వెళ్ళటం, అక్కడ ఖాండవ వన దహనం జరగటం సంభవించాయి ఖాండవ వన దహన వృత్తాంతం వీర రస స్ఫురితం. కాబట్టి ఈ వృత్తాంతానికి గ్రీష్మర్తు వర్ణన పూర్వరంగంగా నిలిచింది. ఈ వర్ణన ఒకే ఒక పద్యంలో వుంది :

"ఉరుతర దావ పావక శిఖో
 త్కలిత శ్వసనంబులున్ సితే
తరగతి తీవ్ర తిగ్మ కర
 ధామ సహస్రములున్ బహుప్రవా
హరహిత నిమ్నగాతతులు
 నైకడు దీర్ఘములై నిదాఘ వా

సరములు సర్వజీవుల
కసహ్యము లయ్యెను దారుణంబులై"

(ఆది 8-230)

దీనికి సంస్కృత మూలం లేదు. కేవలం నన్నయ చేసిన కల్పన యిది. ఖాండవ వన దహన వృత్తాంతానికి కారణమైన రమ్యగిరి సానువులందు విహరించాలనే అర్జునుని అభిలాషకు మూల కారణమైన ఈ ఘర్మ దాహ వర్ణన రెండు విపరీత రసస్థగిత పట్టులకు మధ్యలో వుండటం వల్ల నాటకం లోని అంకావతారం లాగా వుంది. 'తీవ్ర తిగ్మకర' ప్రయోగం సహింప రాని సూర్య కిరణాలను స్ఫురింపజేస్తోంది.

హరివంశములో షష్ఠాశ్వాసంలో ఎఱ్ఱన గ్రీష్మర్తు వర్ణన చేసినాడు. ఇది తొమ్మిది పద్యాలలో వుంది. (32-40) గ్రీష్మం చాలా శక్తిమంతమైనది. అది యెలాంటి మహా ప్రవాహాన్నైనా ఇంకేట్లు చేస్తుంది. నిదాఘంలో నిరవధికమైన వేడిమిని భరించ లేకవిష్ణు మంచు కొండను నివాసంగా చేసికొన్నాడు. బ్రహ్మ మకరందం స్రవించే తామర నాశ్రయించాడు. విష్ణువు సముద్ర మధ్యంలోనే విహరిస్తున్నాడు. వడ గాడ్పులు గాలి, అగ్ని, మైత్రి కల్గి వున్నాయనే భావాన్ని వ్యక్తం చేస్తున్నాయి. కార్చిచ్చును వర్ణిస్తూ ఎఱ్ఱన :

"తమలో రాయిడి గొన్న యున్నతుల
సద్వంశంబులున్ రూపఱున్
సమయించుందమ యాశ్రితావళిని
నెన్నంగా నిజంబిట్టి భా
వము సూతుండను నట్లు వేసవి
మహా వంశాటవుల్ రాసిద
గ్ధము లయ్యెన్నికట ద్రుమా
వళులతోఁ గ్రందంగ దావాగ్నులన్"

(పూ. భా. 6-36)

అని వ్రాశాడు. వంశమంటే వెదురు, కులము- అని రెండర్థాలు. వీటిని పురస్కరించుకొని కవి యిలా వర్ణించాడు. ఒక వంశంలో ఉన్నతులైన వారు తమలో తాము కలహించుకొంటూ రాయిడి పడితే నాశనమౌతారు. చెట్ల నాశ్రయించి వున్న పశులు నశించు విధంగా ఆయా యున్నతులైన వారి నాశ్రయించిన వాళ్ళు నశిస్తారు. స్త్రీలు మల్లికలు, పాటలములు, వాసంతీ పుష్పములు ధరించి వేసవిలో వేడిని అపనయించుకొంటారు. గోపాంగన లే రీతిగా వేసవిలో తాపాన్ని తొలగించుకొంటారో ఎఱ్ఱన ఒక పద్యంలో మనోహరంగా తెలియజేశాడు. ఆ పద్యమిది :

"గోపూర్ణ స్తన దుగ్ధ పాన విధులన్
గోవర్ధనాంతర్గుహా
వ్యాపారంబులు గోపతి ప్రియసుతా
వాః కేళి లీలాస్ఫుర
ద్గోపీ ముగ్ధ చోపగూహనములున్
గోవింద సాంగత్యమున్
గోపశ్రేణికిఁ బాపె తాప భయమున్
ఘోరంపు ఘర్మంబునన్"

(7-40)

పోతన గ్రీష్మమును వర్ణిస్తూ "దినము లంతంతకు దీర్ఘంబులై తోచె" (10-714) అను సీసపద్యాన్ని స్వభావోక్తి రమ్యంగా వ్రాశాడు. ఈ వర్ణనలో కవికి గల శృంగార రసప్రియత్వం కనిపిస్తోంది బ్రహ్మ ప్రజలకోసం బ్రహ్మాండమనే కుండలో ఉష్ణ రసాన్ని నింపినాడా అన్నట్లుగా వేసవిలో వేడిమి ఉన్నదట. (10-715)

నంది, ఘంటలజంట తమ వరాహపురాణంలో నిదాఘాన్ని వర్ణిస్తూ ఎండలలో పైకెగసిన ధూళిని ముసుగుతో పోల్చినారు (2-60), ఎండలో ముసుగేసుకోటం బాధాకరం. అలాగే భూదేవి కప్పుకొన్న ముసుగు భూప్రజలకు బాధాకరమగుట ఇందులోని వ్యంగ్యం. మల్లెపూలు, మామిడిపండ్లు మొదలగు ఈ కాలంలో లభించే పూలను పండ్లను కూడ ఈ జంట కవులు వర్ణించారు.

ధూర్జటి భీష్మమైన గ్రీష్మ స్వభావాన్ని సువ్యక్తం చేసే విధంగా సమానయుక్తమైన రచన చేశాడు పద్యంలో పదాలు ఒకదానితో నొకటి కూడుకొని వున్నా ప్రకృతిలోమాత్రం గ్రీష్మసమయంలో తాపం వల్ల పదార్థాలూ, మానవులూ కూడా విడివడి వుంటారు. ఈ క్రింది పద్యంవల్ల యీ విషయం తెలుస్తోంది.

"దూరీకృత స్తవ ఘారకంమక వధూ
జనము మానవ కరాంచ ద్వ్యజనము
గంధవాహాచల గంధవాహారిదం సు
జన్య ముష్టి కృతాశ్వాసచయము
... ... ... ... ... ... ... ..." (1-122)

ఎండల తీవ్రతను ధూర్జటి యీ క్రింది విధంగా వివరించాడు :

"ఎండెఁగొలంకులెల్లను
మహీధరముల్ దవవహ్నికీలలన్
మండె ధరాతలం బినువ
మంగలముంబలె నుండెఁగాలియా
యెండల నేమి చెప్పఁ
బరమేశ్వర ! యావరణాంబు రాశిలే
కుండిన నాడె పొక్కి
వడకుండెనె పద్మభవాండ ఖాండముల్"

(1-128)

నన్నెచోడుడు పార్వతీదేవి తపస్సు చేసిన సందర్భంలో గ్రీష్మర్తువును వర్ణించిన విధం పరిశీలింప దగివుంది. నిదాఘము భయంకరాకారంతో ఒప్పినది. కాబట్టే కవి "తలచిన డెంద ము కందును బలికిన నోరెల్లఁ బొక్కుఁ బ్రభఁ చూచిన రెప్పలు గమరు ననగఁ బటుతర విలయానల ఖాతి నెండ వేసవి గాచెన్" (6-1౬౯) అని వర్ణించాడు. వేసవికాలం త్రిమూర్తులకు కూడ భయాన్ని కలిగించిందంటూ కవి యెలా చమత్కరించాడో చూడండి :

"హరిశరధిఁ గ్రుంకె; నభవుడు
సురనదిఁ దలఁ దాల్చె; నబ్జజుడు గ్రమ్మఱ నం
బురుహంబు సొచ్చె; నతి దు
స్తరం దుస్సహ తీవ్ర తర నిదాఘ భయమునన్"

(6-139)

ఈ సందర్భం లోని మరో పద్యం ఎంతో వినూత్నంగా వుంది. అది :

"అతప భీతి నీడలు
రయంబున మ్రాకుల క్రిందు దూఱెనో
యాతరులుం దృషాభి
హతులై తమ నీడలు దార ద్రాగెనో
ఖాతి ననంగ నీడ లురు
పాదప మూలములం దడంగె గ్రీ
ష్మాతప మధ్య వాసరము
లందుఁ జలింపక యుండు నెండలన్"

(6-141)

అనే పద్యం. ఇలాంటి వర్ణన మన వాఙ్మయంలో ఎక్కడా కనిపించదు. తమిళ వాఙ్మయంలో వున్నదంటారు.

శ్రీనాథుడు హర విలాసంలో ఒక చోట ఎండను వర్ణించాడు. అర్జునునితో రథమును పంపుతానని చెప్పి ఇంద్రుడు వెళ్ళాక అర్జును డొక చెట్టు క్రింద విశ్రమించాడు. అప్పుడు బాగా ఎండ కాసింది. ఆ వర్ణన ఇలా వుంది :

"మౌళిం గోహళి సంఘటించిన
త్రియన్మధ్యాహ్న వేళన్మహా
కాళంబై వనిలో విభాగమున
వీకంగాసె తీరెండ యా
ప్రాలేయాహిత సంప్రదీప్త కిరణ
ప్రక్రీడ దర్కోజ్వల
జ్వాలాజాల జటాల జాంగల
తటీ వాచాల కోష్టియై"

(7-109)

ఇందలి సుదీర్ఘ సంస్కృత సమాస భూయిష్ఠ రచనచే ఎండ తీవ్రత వ్యంజింపబడింది.

కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో నొక చోట వేసవిని వర్ణించాడు. 22వ బొమ్మ చెప్పిన కథలో విక్రమార్కుడు రాజ్యాన్ని మంత్రుల కప్పగించి షణ్మాసాలు విదేశాలలో సంచరించేటప్పుడు ఒకచోట వేసవి వచ్చింది. అది పాంథులకు వేసట పుట్టేట్టుగా, వెట్టగొట్టు నట్లుగా వచ్చింది. పరిమళాలచే పూలకు పరువమేర్పడగా ఉష్ణపవనం వీచింది. ఎండచే నెరియలు ఏర్పడగా నవఖండములుగా వున్న భూమండలం అనేక ఖండము లయింది. ఇట్టి చల్లని చంద్రుని చేరింది. చలువకై అచ్యుతుడు అత్తవారిని చేరెను. వడకాలం గడపడం కఱకంఠునికి కడిది అయింది. పాముల విషం, మెడ విషం, నొసటి చిచ్చు వేడిమి ముడివడటంవల్ల అతనికలా

అయింది. చల్లని గంగాజలం, చల్లని చంద్రుడు కలిగి చల్లని కొండకల్లుడై అతడా వేసవిలో కొంత బ్రతికి పోయాడు. పద్మగృహంలో పువ్వాడి, తేనె వుండటం వల్ల ఎండ కన్నెరుగకుండా అజుడున్నాడు. జలము మృతమై జీవులకు చవికెక్కింది. ఇలాంటి వేసవికి ఇతర కాలాలు సరికావు.

ఉద్యానవన వర్ణన చేస్తూ తిమ్మన "మొనస నౌకకడ సామి సంపుల్లమల్లి పాటలీ చంపకోత్పల ప్రౌఢి మములు" (3-46) అని గ్రీష్మమును సూచించినాడు. రాయలు గ్రీష్మాన్ని 26 పద్యాలలో వర్ణించాడు. (2 ఆ 45-70). వేసవిలో పాటలములు పుష్పిస్తాయి, బూరుగు పండ్లు పగులుతాయి, ఎండమావులు కనబడతాయి. సెలయేళ్లలో చట్రాలపై నాచు వేడిచే పేటులెత్తుతుంది. దావాగ్నిచే కాలిన చెట్ల ఆకులను చూసి పావురాలనుకొని డేగలు పరుగెత్తెవట. భైరవస్వామి కోసం ఉదికి ఆరవేసిన వస్త్రాలవలె బయళ్లున్నవట భైరవుడు దిగంబరుడు కాబట్టి దిక్కులు బట్టబయలై శుభ్రంగా వున్నాయని భావం,

సుడిగాలులకు ధూళిచక్రాలు లేస్తున్నాయి. వాటి అంచులలో గడ్డి అంటుకొని గుండ్రంగా తిరుగుతోంది. ఈ విధంగా ధూళిచక్రాలు తిరగటం చూస్తుంటే బావులు సూర్యకిరణాలు తమ జల ధనాన్ని దోచుకుపోగా తిరిగి యిమ్మని మొఱ పెట్టటానికి సూర్యుని వద్దకు పోతున్నాయేమో అని తోస్తుంది.

రాత్రియైనా భూమి నుండి ఆవిరి లేస్తూనే వుంటుంది. ఎండ వేడి ఆరకుండానే వెన్నెల వ్యాపిస్తుంది. ఇది కాలుచున్న పెనం మీద అట్ల పిండి పోసినట్లుగా వుంది.

వేసవిలో మన్మథ విజృంభణం వుండదు. దీన్ని రాయలు—

"అట్టి వేసవి బెడిదంపు వెట్ట కతవ
హాస్తము సెమర్చి సారెకు అస్తకంబు
దునికిలక గాదె ససరింప వశము గాక
పుష్పబాణుని చెఱకు విల్పుడమిం బడియె"

(2-65)

అని సమర్థించాడు. ఈ వేసవి కాలంలో మలయమారుతం వట్టివేళ్ళ తోను నెమలి పురుల తోను చేసిన విసనకఱ్ఱల వల్లనే కాని యితర సాధనముల వల్ల వ్యాపించటం లేదు. వేసవిలో బావులలో నీరు చాల లోతుగా వుంటుంది. పొడవైన త్రాటితో చాలా సేపు తోడితే కాని నీళ్ళు రావు. సూర్య తేజం వల్ల ఇగిరి పోవునేమో యని భయపడి పాతాళానికి చేరియున్న ఆ జలశైత్యం, ఆ నీళ్ళు తోడటానికి వచ్చిన స్త్రీల కుచశైత్యానికి ఆకర్షింపబడి నీళ్ళు పైకి వస్తున్నట్లుగా వున్నవట. (2-66)

ఇలా వేసవి కాలాన్ని మనం అనేక కావ్యాలలో చూడవచ్చు, కావ్య లోకంలో కొన్నిచోట్ల అతిశయోక్తులనిపించేవి మన లోకంలో నేడు స్వభావోక్తులుగానే పరిణమించాయి.

—డాక్టరు పి. వి. చలపతిరావు
11-14 రామంతాపూర్ హైదరాబాదు

# "జీవన సమరం" చదవడం ఒక అనుభవం

డాక్టర్ రావూరి భరద్వాజ రచించిన 'జీవన సమరం' అనే గ్రంథం చదవడం యాభై ఏళ్ళ తెలుగు సాంఘిక జీవితాన్ని దర్శించి, అందులో కేటాయించినట్లుగా కనపడే ఒక వర్గం వారి బ్రతుకులను పరిశీలనగా చూచినంత అనుభవం పొందడం వంటిది. ఇటువంటి శాలు ఇదివరకు రాలేదని అనలేను ప్రసిద్ధ -ఆంగ్లియన్ రచయిత అర్. కె. నారాయణ్ వంటివారూ (ఆస్ట్రిలజర్స్ డే వంటివి), ఇంకా మన దేశీయ భాషల రచయితలు కొందరూ ఇటువంటి వాక్చిత్రాలు కొన్ని రచించిన మాట నిజమే. కాని వారు తాము తీసుకున్న ఇతివృత్తాన్ని ప్రధానంగా హాస్యసృష్టి కోసం ఉపయోగించుకున్నారు. ఐతే పూట బత్తెం కోసం పాట్లు పడే ఈ జీవుల బ్రతుకు తెరువులను మన వినోదం కోసం ముడి సరుకుగా వాడుకోవ

డం ఒక విధమైన క్రౌర్యమేమో. వీరిని చూచి 'కోటి విద్యలు కూటి కొరకే' అనీ, 'ఉదర నిమిత్తం బహు కృత వేషం' అనీ మెట్ట వేదాంతం చెప్పడమూ శుష్క ప్రసంగమే అవుతుంది, స్పందించే హృదయం గల రచయిత వీరిని గంభీరంగా, గాఢంగా అవలోకిస్తాడు. భరద్వాజ ఆ పనే చేస్తూ 'ఇలాంటి పనులు చేస్తున్న వారి శ్రమకు తగిన ప్రతిఫలం లభిస్తున్నదా ?' అన్న విఖ్యాత రష్యన్ రచయిత మాక్జింగోర్కీ ప్రశ్నను ముఖ్యంగా దృష్టిలో ఉంచుకొని ఈ జీవిత చిత్రణలకు పూనుకున్నట్లు విశదమవుతున్నది,

కాని ఎంత వైశాల్యం, ఎంత విస్తృతి ఈ రచనల్లో! ఎన్ని రకాల వృత్తులూ! ఉపాధులూ. అన్నం కేరియర్లు చేరవేసే అంజమ్మ, తన పాకకు తాళం అక్కర లేదు కాని ఇతరుల తాళాలను బాగు చేసే జహంగీరు, ఒక పెద్ద రొంపి నుంచి బైట పడి మిరపకాయ బజ్జీలు అమ్ముకొనే సాయిత్రి, అరిగించుకునే శక్తి ఉంది కాని తృప్తిగా తినడానికి లేని కమ్మరి శ్రీరాములు, రోడ్డు వార రాళ్ళను కంకరగా కొట్టే ఆగమయ్య, అందరి గొడుగులూ బాగు చేస్తూ తాను మాత్రం మండు టెండలో, జడివానలో ఏ చూరు చాటునో తల దాచుకునే శంకరయ్య, పరుల కేశ సౌందర్యానికి సాయపడే పూసల రాములు. రంగుల రాట్నాలు తిప్పి బ్రతికే జాఫర్, నేత పనిలో అన్ని మెలకువలూ తెలిసి వుండి కూడా గతి లేక దిన బత్తెం కోసం మూరు బేరానికి బట్టలమ్ముకొనే వీరాస్వామి, తుక్కు లోనూ సీసా పెంకులలోనూ తన బతుకును పోగు చేసుకునే ముత్యాలు, ఇటుకల రాముడు, పశువులకు నాడాలు వేసే కాశయ్య, అద్దాలకు పై మెరుగు పెట్టే శామ్యూల్, దగాకోరు సమాజంలో నిజాయతీతో బ్రతకాలని అనుకొంటూనే ఖాళీ బీరు సీసాల వ్యాపారం చేసే చలపతిరావు, సినిమాల పిచ్చిలో దగా పడి చివరకు పూలమ్ముకొని బ్రతికే నాగరాజు, సర్కస్ విద్య మొదలు చిలక జోస్యం బిజినెస్ దాకా వచ్చిన పండిట్ యశ్వంత్, పది వేళ్ళతో పని చేసినా ఐదు వేళ్ళు నోటికి చేరక పూట బత్తెం పుల్ల వెలుగ్గా ఉండే బాలయ్య. వంట పాత్రలకు కాయకల్ప చికిత్స చేసే రజాక్, రోడ్డుపై రంగు రంగుల బొమ్మలు గీసే నటరాజన్, పాముల ఖాజా మియా, సముద్రాలన్నా నిండుతాయి గాని ఈ జానెడు పొట్ట నిండదని మొర పెట్టుకొనే కుండల గురవయ్య, విశ్వాసం జంతువు సొత్తు అని ఉద్ఘాటిస్తూ ఎలుగుబంటి నాడిస్తూ ఊళ్లు తిరిగే రామస్వామి, పీచు మిఠాయి ముని కన్నయ్య, ఎరుక చెప్పే నరసమ్మ, చేపలు పట్టే గంగయ్య, పరుపులు కుట్టే మీరా సాయబు, గడకర్ర ఆట ఆడే రాములమ్మ, మా లాంటి వాళ్ళను జైల్లో పెట్టడం కూడా ఈ గవర్నమెంటుకు చాత కాకపోతే బైటనే బ్రతకాలంటే చచ్చే చావుగా ఉందనే నేత పని రామస్వామి, వడ్రంగం, కమ్మరం వచ్చి కూడా బస్తీవచ్చి కర్రపనిలో చేరిన బ్రహ్మానందం, పేశఉండలు చేసి అమ్మే పోశమ్మ, వేలం పాట ఒక పనిగా పెట్టుకొన్న ఏకాంబరప్ప, వెదురుతో వెయ్యి రకాలు చేయగల తిరుపతయ్య, టోకెన్లతో చాయ్ రొట్టె సప్లయి చేసే జహంగీరు, పెన్నులు రిపేరీ చేసే నూకరాజు, చెవి గుబిలి తీసి తల మాలీషు చేసే రామదాను, గంగిరెద్దుల బసవయ్య, కట్టె వేళ్ళు చేసే పావయ్య, చాకులు సాన పట్టే పండరి— ఇన్ని రకాల పాత్రధారులతో ఈ గ్రంథం 'జీవన సమరం' వాక్చిత్రాల మ్యూజియం వలె ఉంది పైగా వీళ్ళల్లో కొందరు మొదటి నుంచి వారి వారి పనులే చేయడం లేదు కొందరు ఒక పని నుంచీ మరొక పనికి డొల్లుకుంటూ వచ్చి చివరకు ఆ పనిలో తేలిన వాళ్ళు. వీరిలో కొందరి పూర్వీకులు గొప్పగా బ్రతికిన వాళ్లు కొందరు పూర్వాశ్రమంలో తాము తిని ఒకరికింత పెట్టగల స్తోమతతో జీవించిన వాళ్లు, ఒకతను తన చేతితో ఒకప్పుడు అష్రఫీలు ఇచ్చినవాడు. ఆ చేతి తోనే ఐదు పైసలూ అందుకునే అవస్థకు చేరుకున్నాడు నొసటి రాతలు మారాయి. ఓడలు బండ్లయాయి. ఐనా ప్రారబ్ధం కొద్దీ దాపురించిన ఆ దిక్కుమాలిన వృత్తితోనే జీవితాలు నెట్టుకొస్తున్నారు. వారికి నిత్యం జీవితంతో పెనుగులాటే. 'ఏ పూట ఎలా గడుస్తుందా ?' అన్న బ్రతుకు భయంతో జీవించే మానవులు. ఐనా వీరు తిరిగేది సంపదల మధ్య, మేడల మధ్యనే.

వీళ్లల్లో కొందరివి రిస్కీ వృత్తులు. కొందరివి ఎప్పుడో కాని డిమాండు ఉండని పనులు. ఒకపని దొరికితే

నాలుగు డబ్బులు గిట్టుతవి, లేకపోయిందా పస్తులే. ఒకచోట గిరాకీ తగ్గితే మరొకచోటికి మకాం ఎత్తి వేయాలి. సంచార జాతులవలె జీవించాలి. ఇక నికరాదాయం ప్రసక్తి ఎక్కడ? రెక్కాడితే డొక్కాడని బ్రతుకులు. ఐనా గత్యంతరం లేక అవృత్తికే అంటిపెట్టుకొని ఉంటారు. అది 'పిడికెడు అన్నం పెట్టక పోతుందా?' అన్న ఆశ. ఆకలి నేర్పిన వృత్తులు. 'మరొకరోజు జీవించుదా'మన్న కోర్కె.

ఈ జీవితచిత్రాల రచనలో రచయిత అవలంబించిన విధాన మొకటి ఉన్నది. మొదట ఏదో ప్రస్తావన చేస్తాడు. పూర్వరంగం పరచుతాడు. తరువాత తన పాత్రధారిని ప్రవేశపెడతాడు. అతని కథాకమామీషూ చెబుతాడు. సరిగ్గా పత్రికా రచనలో ఉండేటువంటి ఇంటర్వ్యూలాంటి తతంగం పెట్టక, ఎక్కడో ఒక్క ప్రశ్న వేసి ఏదో రాబట్టుతాడు. ఇక ఆ వృత్తి సంబంధించిన ఆర్థిక విషయాలనూ, లాభనష్టాలనూ, తథావతులనూ, తప్పీళ్ళనూ. జనం ఇష్టానిష్టాలనూ వాటిని బట్టి వీళ్ళు ఏవో నాటకాలాడవలసిరావడం, నిజం చెబితే నమ్మని లోకం, దేని వ్యాపార రహస్యం ఏమిటో, ఇంత తెలివిగా మసులుకున్నా దక్కేదేమిటో అంతా చెప్పి, చివరకు వాళ్ళ మనోభావాలను వెల్లడి చేస్తాడు. అవి రకరకాలు. అవి మన పల్లెలలో, పట్టణాలలో కాలక్రమేణా వచ్చిన సాంఘిక ఆర్థిక పరిణామాన్ని సూచించేవిగా ఉన్నాయి, వారిలో చాలామంది చెప్పినవి సామాజిక శాస్త్రజ్ఞులు గమనించవలసిన అంశాలు. ఒకతను 'తాను చూస్తూ ఉండగానే తన కళ్ళముందే ఈ లోకం పాడై పోయింద'ని అంటాడు. మరొకతను 'మన పల్లెలు వెనకటిలాగా లేవనీ, పూర్వంలా తమకు కావలసినవాటిని ధారాళంగా ఇచ్చే ధర్మాత్ములు లేరనీ' వాపోతాడు, కాని మన దేశంలో వచ్చిన సాంఘికార్థిక పరిణామం ఎలా సంభవించిందో, జనాభా ఎన్నిరెట్లు పెరిగిందో, అది వ్యవసాయోత్పత్తుల ధరలు పెరగడానికి ఎలా కారణమైందో, తత్ఫలితంగా రూపాయకు ఎలా విలువలేని స్థితి వచ్చిందో, వ్యాపారం వల్ల, కొత్తరకాల పరిశ్రమల వల్ల ఆర్థిక వ్యవస్థ ఎలా మార్పు చెందుతున్నదో ఆ వ్యర్థార్థ జీవులకు ఏమి తెలుస్తుంది? వాటిని పట్టించుకొని పథకాలూ, ప్రణాళికలూ వేసే పాలకులే నిర్దుష్టమైన విధానాలు అవలంబించక, అరకొరగా ఏదో చేస్తూ చివరకు కొరవ, కరువు ఎలా తెచ్చిపెడుతున్నారో వాళ్ళకు ఏమి అవగతమవుతుంది? వాళ్ళకు తెలిసినదల్లా మానవజీవితం వెనుకటిలా సలీసుగా లేదు. గతకాలమే మేలు. పిదపకాలం, పిదప బుద్ధులూ వచ్చాయి. ఇవన్నీ మననం చేసుకున్న రచయిత 'వీళ్ళ ముఖాన సంతృప్తి రేఖలు విప్పారేదెప్పుడు?' అని తనను తానే ప్రశ్నించుకొని' ఆ సమసమాజమో, చట్టుబండలో తొందరగా రావాలి' అన్న ఆరాటాన్ని వ్యక్తం చేస్తాడు. చదువుకున్నవాడికి దారే లేదన్న వాస్తవాన్ని గమనించి వేదన చెందుతాడు ఆర్చేదెవరు? తీర్చేదెవరు? ఒక దారీ తెన్నూ లేనివారి కళ్ళల్లో కనిపించే నిరాశా నిస్పృహాలకు తానూ వ్యథితుడై 'ఈ సామాజిక వ్యవస్థలో వీరి కలలు నీరుగారి పోతాయే తప్ప, ఫలించవు' అన్న నిరాశకు లోనవుతాడు.

ఈ అన్నార్తులు వెలిబుచ్చిన భావాలు దేనికవేగా ఉన్నా, పాతగుడ్డలకు స్టీలు గిన్నెలిచ్చే కేశవులి మాటలు మనల్ని తత్త్వానికీ, తాపత్రయానికీ దూరంగా నీతినియమాల ప్రసక్తిలేని స్వేచ్ఛాసంచారపు అంచులకు తీసుకువెళ్లుతాయి. అతను ఈ జీవితంపై విసుగెత్తి ఉన్నాడు. పట్టెడన్నం కోసం ఎన్నో పాట్లాయె! కాబట్టే 'ఈముండ మోపి దేశంలో ఏవ్వూరైతేనేమిటండీ' అని అతను పుట్టిన ఊరు పేరెత్తడు. తన ఈ బ్రతుకు వల్ల తన తల్లిదండ్రులకు అప్రతిష్ఠ వస్తుందేమోనన్న జంకుతో వాళ్ల పేర్లే ప్రస్తావించడు. అతను మొదట సోమరిపోతు కాడు. కాని ఈజీవన సమరం అతన్ని ఏవిధంగా తయారు చేసిందో చిత్తగించండి

అతనంటాడు ...

కావాలనే నేను సోమరి తనాన్ని అలవాటు చేసుకున్నానండీ. పది రూపాయలున్నాయనుకోండి. పని చేయ బుద్ధి కాదు. ఆ పదీ అయిపోవాలి. ఆ తరువాత అప్పు చేస్తాను. అప్పు కూడా పుట్టనప్పుడు పస్తులుంటాను. ఇక పస్తులుండలేనని తోచినప్పుడు మళ్ళా ఏదో పని లంకించుకుంటాను. ఉన్నదంతా ఖర్చు చేస్తాను. ఐపోతే మళ్ళీ సంపాదిస్తాను. సంపాదించడం చేత కాని వాడికి భయం. మాయ చేసి బతుకుతాను. అయితే

సక్రమంగా బతకలేననుకోండి.' తమ చుట్టూ ఉన్న సమాజంపై తమ కున్న ద్వేషాన్ని తీర్చుకునే మార్గం లేక, ఆ కసిని వీళ్లు తమ మీదే తీర్చుకుంటున్నారా అన్న ప్రశ్న ఇక్కడ ఉదయిస్తుంది.

జీవితం సాధించరానిదైతే వీళ్ళు అంత కన్నా మొండి కెత్తుతున్నారు. అంత కన్నా తెగింపుతో దానిపై ఈ విధంగా తిరగబడుతున్నారు. ఈ కేశవులుకు జీవితంలో స్థిరపడాలని లేదు. ఒక చోట కుదురుగ ఉండాలని లేదు. ఆతను దేనికైనా సిద్ధమే, పెళ్ళి పెటాకులూ లేవు. పేకాట ఆడతాడు తాగుతాడు ఒక మారు వి. డి (సుఖ రోగాల) వార్డులో ఉండి వచ్చాడట, ఇటువంటి వాళ్లు కూడా తయారవడానికి మన సమాజం అవకాశమిస్తూ ఉన్నంత వరకూ ఈ సమాజాని కొక భద్రత, నిలకడ ఏమిటి? అసలు మనం ఏ దిశగా పోతున్నట్లు? అలా బ్రతుకు ఈడ్చే వాళ్లు విముక్తు లవుతారు అన్న హెచ్చరిక ఇక్కడ ఉంది, ఆ రోజు చరిత్రలో ఒకప్పుడు వచ్చింది. మళ్ళీ ఎప్పుడో వస్తుంది. ఈ పాత్ర మనో భావాలను రచించడంలో భరద్వాజ అనితర సాధ్యమైన ప్రతిభ కనపరిచారు. సామాజిక ప్రయోజనం కల రచనకు ఇది నికషోపలం వంటిది.

పలురకాల వృత్తులు ఈ వాక్చిత్రాలకు ఇతివృత్తాలవడం చేత, రచయిత వృత్తులకు సంబంధించిన భాష ఎరిగి ఉండడం చేత, ఈ పుస్తకంలో మన వాడుకలో లేకుండా పోతూ వున్న పదజాలం భద్రపరచబడింది. ఉదాహరణకు; 'కర్ర కడగడం,' 'జారుపొయ్యే ఖాతాలు', 'మాయలు పన్నడం', 'కాట్రేడుకోళ', 'చదువు గుంటపూలు పూసింది', 'అస్తు బిస్తుగా', 'కచ్చా పచ్చాగా' వంటి మాటలు.

పోతే ఈ రచనలు సాహిత్యం క్రిందికి వస్తాయా?' అన్న ప్రశ్న ఎవరైనా లేవదీయవచ్చు. యథార్థానికి యివి సామాజిక శాస్త్రానికి సంబంధించిన రచనలు, ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే యిది సాంఘికార్థిక విషయాల సమాలోచనం. కాని వీటిని వ్రాసిన రచయిత వస్తుతః సాహితీ పరుడు. సృజనాత్మక సాహిత్యాన్ని ఎంతో సృష్టించిన వ్యక్తి. కాబట్టే ప్రతి ఖండిక ఒక సాహిత్య శకలం వలె ఉంది ఆ విధమైన పనితనం స్ఫుటంగా కనిపిస్తూ వుంది. అసలివి ఒక ప్రక్రియగా కన్పిస్తాయి. ఏమైనా ఆంధ్ర దేశంలోని సాంఘిక జీవిత లో బడుగు మనుషుల జీవన సంగ్రామం చిత్రితమై, క్రమేపీ అంతరించిపోతూ వున్న ఒకప్పటి మన నాగరిత ఈ రచనలో ప్రతిబింబితమై ఉన్నది. అన్నిటి కన్న ముఖ్యం-'మేం చాలా అభివృద్ధి చెందాము 'అని మిడిసిపడుతూ ఉన్న మన ఈ సమాజంలో 'ధర్మం, న్యాయం ఎక్కడి ఏడిశాయి' అన్న ఆవేదన ఉంది. అదిగొప్ప విషయం. అందుకు ఈరచయిత సాంఘిక సంస్థల గౌరవాన్ని అందుకోవడానికి అర్హత కలిగి వున్నాడు.

— డి. రామలింగం




# సారస్వతాలోకము

రచన-రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ
వెల రూ. 5-50
ప్రచురణ-త్రివేణి పబ్లిషర్సు

ఆంధ్ర సాహిత్య విమర్శను క్రొత్త మలుపు త్రిప్పినవారు కట్టమంచి రామలింగా రెడ్డిగారు. రాళ్లపల్లివారు, రామలింగారెడ్డి గారి విమర్శన మార్గాన్ని అనుసరించడమే కాక వారిని తమ గురువుగా భావించి ఉత్తమ విమర్శను వెలయించారు విమర్శన రీతిలో విశిష్టతనూ, విలక్షణతనూ సాధించి ఆంధ్ర సాహితీ లోకంలో చిరస్థాయిత్వాన్ని సంపాదించారు అనంత కృష్ణ శర్మగారు. ఉజ్జ్వలమైన శైలీ విన్యాసంతో చక్కని చిక్కని తెలుగు పలుకుబడితో శర్మగారి విమర్శనా విధానం వివేచనా ప్రరోచనంగా సాగుతుంది.

ఈ గ్రంథం ఎనిమిది సాహిత్య వ్యాసాల సంపుటి. ఇందులో రాయలనాటి రసికత, రాయల వైదుష్యము, నాచన సోముని నవీన గుణములు, నిగమశర్మ అక్క, రంగనాథ రామాయణము, ఆంధ్రవాఙ్మయమున నాచన సోమనాథున కీయదగిన స్థానము, త్యాగయ్యగారి నాద సుధారసం, తిక్కన్న తీర్చిన సీతమ్మ అనే వ్యాసా లున్నాయి.

ప్రతివ్యాసంలోనూ శర్మగారి ప్రతిభాపాండిత్యాలు ద్యోతకమౌతాయి. నాచన సోముని నవీన గుణములు, రంగనాథ రామాయణము, ఆంధ్ర వాఙ్మయమున నాచన సోమనాథున కీయదగిన స్థానము అనే వ్యాసాలు రాళ్లపల్లివారి ప్రజ్ఞకూ, ఉపజ్ఞకూ, విమర్శనా నైపుణికి నికషోపలాలు.

శర్మగారి రచనా రీతి ఒక విధమైన విశిష్టతను సంతరించుకున్నది. సరసంగా సాగుతుంది. చెప్పదలచుకున్న అంశం సూటిగా, ఒక్కొక్కచోట వ్యంగ్య గర్భితంగా వుండి పఠితలను ఉత్తేజ పరుస్తుంది. కొన్ని కొన్ని సందర్భాల్లో సున్నితమైన హాస్యం లాస్యం చదువరులకు గిలిగింత పెడుతుంది. శర్మగారి రచనా రీతికి ఒకటి రెండు ఉదాహరణలు.

"మన దేహములు మన యధీనములా? దర్జీవాని కమ్ముకొన్నవి! వాడు మన కష్టదిగ్బంధనము చేసి మన స్వేద పరిమళమును మన దేహము మీదనే భద్రముగ రక్షించి పెట్టుచున్నాడు"

(రాయలనాటి రసికత)

"నరములలో పొంగివచ్చుచున్న శక్తి ప్రవాహమునకు వేఱుచోటు చూపకున్న నది నిలుచునా? కావున నేయిచేతుల బాణా సురునకువలె తమకును గలిగిన చేతులతీట పొగొట్టుకొనుటకై మనుష్యులు భావ ప్రపంచమునుండి వస్తు ప్రపంచమునకు దిగి ఇండ్లు, పట్టణములు, రాజ్యములు. విద్యలు, కళలు మొదలగు వివిధ పదార్థ నిర్మాణమునకు లోబడినారు"

(నాచన సోముని నవీన గుణములు)

అనంత కృష్ణ శర్మగారి భాష గ్రాంథికమైననూ సరళంగా వుంటుంది. అయోమయతగానీ, అస్పష్టత గానీ కనిపించదు. త్యాగయ్య గారి నాద సుధారసం, తిక్కన్న తీర్చిన సీతమ్మ, అనే చివరి రెండు వ్యాసాల్లో వాడుక భాష వాడబడినది. సాహితీ లోకం పదే పదే చదువదగిన ఉత్తమ సాహిత్య విమర్శన గ్రంథం సారస్వతాలోకము.

-వేముగంటి

# అరణ్యా నేత్రం

రచన-జయధీర్ తిరుమలరావు
వెల రూ. 3-50
ప్రతులకు- నవయుగ బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైద్రాబాద్- 500001.

పీడిత సమాజానికి ప్రతీక అరణ్యం. సమాజంలోని తిరుగుబాటుతనాన్ని ప్రకటిస్తున్నాడు కవి. అదే అరణ్యనేత్రం. ఇది వివిధ శీర్షికలు కలిగిన కవితా సంపుటి సంపుటిలోని కవితలు కవి ఆశయానికి అనుగుణంగా వున్నాయి. డా॥ సి. నారాయణరెడ్డి కె. వి. రమణారెడ్డి, నగ్నముని గారలు తిరుమలరావుగారి కవితలను ప్రశంసిస్తూ అభిప్రాయాలిచ్చారు.

ఆధునిక సాహితీ విమర్శకులు, కవులు కొందరు సందర్భమున్నా లేకున్నా ప్రాచీన కవులనూ, కవిత్వాన్నీ ఈసడించడం, దుయ్య బట్టడం ఒక ఫేషన్‌గా తయారైంది. ఈ పుస్తకానికి అభిప్రాయా లిచ్చిన రమణారెడ్డి, నగ్నముని గారలు పూర్వ కవితను ఈసడిస్తూ కొన్ని వాక్యాలు వ్రాశారు. తిరుమల రావుగారు కూడా ఈ సంపుటిలో "నా వూపిరిలో జనం, జనం ఊపిరిలో నేను" అనే కవితలో నన్నయ తిక్కనాది ప్రాచీన కవులనూ, కవిత్వాన్నీ దుయ్య బట్టారు. ఇప్పటి కవిత్వాన్ని ఆకాశాని కెత్తడానికి పూర్వ కవుల కవితను ఈసడించటమెందుకో అర్థం కాదు.

తిరుమలరావు గారు ప్రతిభావంతులు. తాను చెప్ప దలచుకున్న విషయానికి చక్కని రూపకల్పన చేసి ప్రదర్శించడంలో మంచి నేర్పును చూపించారు.

"అరణ్యం నిదుర పోతోంది
అట్లని
సూర్యుడుదయించడనుకో కండి
పచ్చని ప్రతీ పత్రం
సూర్యుణ్ణి గుండెల్లో నిలుపుకోందే-
నిద్రించడ మంటే జీవించి ఉన్నట్లే" (ఊపిరి)

"ఈ చీకటిలో
రేపు సూర్యుడుదయించడని
చెబుతున్నందుకు క్షమించండి
సూర్యుడు నానరాల్లో చిక్కుకున్నాడు
ఐనా భయపడకండి
రేపు త్యాగం ఉదయిస్తుంది"

ఈ మొదలైన పంక్తులు కవి రచనా నిపుణతకు మచ్చుతునకలు.

అడవి తుఫాను, అగ్గిపుల్ల, అరణ్య గర్భం మొదలైన శీర్షికలు కవి భావనా శక్తిని వెల్లడిస్తున్నాయి. చాలా కవితల్లో రూప కాలంకారాలు వాడబడినాయి. కాని కొన్ని రూపకాలు అంత ఉచితంగా కనిపించవు.

"గుంద్రని స్తనబింబాన్ని అధికారం మబ్బు పైట కప్పి బిగించినా పాల చేపు వచ్చినట్లు జనం బిడ్డల కోసం" అనే రూపకం ఎబ్బెట్టుగా వుంది.

-వేముగంటి

# ఎర్ర రంగస్థలం

ప్రచురణ- జన నాట్య మండలి, హైద్రాబాదు
వెల రూ. 1-50
ప్రతులకు- పీస్ బుక్ సెంటర్, లింగంపల్లి చౌరస్తా, కాచిగూడా, హైద్రాబాదు.

ఇది చైనాలో రంగస్థలంలో మార్పులను గురించీ, జానపద రూపాలను, నాటక ప్రదర్శనలను గురించీ

వివరించే పుస్తకం. ఇందులో ఎర్ర రంగస్థలం, చైనాలో తోలు బొమ్మలాటలు, కళలు, ఆటలు, వీరోత్సాహం, పొలాల్లో నాటక ప్రదర్శనం, చీనా జానపద ప్రదర్శనలు, ఎర్ర పూల పర్వతం, నేనూ ఎర్ర సైనికుడి నౌకా (సినిమా కథ) జన చైనాలో ప్రజా కళలు మొదలైన శీర్షికల క్రింద ఆయా విషయాలు చక్కగా వివరించబడినాయి. ఇవే కాక మన దేశానికి సంబంధించిన వ్యాసాలు కూడా వున్నాయి. అవి "బీహారులో ఉద్యమం"- వీధుల్లో రచయితలు- కళాకారులు", "చండీఘర్, బొంబాయిలలో సంచలనం సృష్టిస్తున్న కళా రూపాలు" చివర 'జన నాట్య మండలితో ఇంటర్వ్యూ' ఉంది

చైనాలో నాటక ప్రదర్శనలోనూ, ప్రయోగంలోనూ వచ్చిన పరిణామాలు తెలుసుకొనుటకు ఈ పుస్తకం బాగా తోడ్పడుతుంది.

-వేముగంటి

# వార్తావాహిని

## హిందీ ప్రమాణ పత్ర వితరణము దేవరాపల్లి

విశాఖపట్నం జిల్లా దేవరాపల్లి జూనియర్ కళాశాలలో 8వ హిందీ ప్రమాణ పత్ర వితరణోత్సవము 15-7 81 బుధవారం సాయంత్రము 4కి గం॥ వైభవముగా జరిగినది. ఆనాటి సభకు స్థానిక కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ M. J. V. సత్యనారాయణ మూర్తి (M. A. MEd) గారు అధ్యక్షత వహించిరి అధ్యక్షులు తమ తొలిపలుకులలో హిందీ ప్రచార ప్రగతి, ప్రచారకులు శ్రీ చందక. సత్యనారాయణ అవిరామ కృషి గురించి మాట్లాడుచూ హిందీ నేర్చుకొను ఆవశ్యకతను గూర్చి వక్కాణించిరి.

ఆనాటి హిందీ సభకు వందలాది హిందీ అభిమానులు. హిందీ విద్యార్థులు విచ్చేసిరి. పలువక్తలు హిందీ భాష గురించియు హిందీ ప్రచారకులు చేయుచున్న భాషా సేవగురించియు ఉపన్యసించిరి.

పలు వక్తలు శ్రీ చందక సత్యనారాయణ ఆంధ్ర రాష్ట్రములో ఆదర్శ హిందీ ప్రచారకులని స్నేహశీలురనియు, సద్గుణ సంపన్నులనియు, విద్యార్థుల యందు మంచి ప్రేమ గలగిన వారనియు. హిందీ భాష బోధించడములో తగిన సామర్థ్యము గల వారనియు ప్రశంసించిరి.

తరువాత హిందీ ప్రచారకులు శ్రీ చందక సత్యనారాయణ తన వార్షిక రిపోర్టు చదివి వినిపించిరి. తదుపరి ప్రమాణ పత్రములు ప్రసాదించిరి. విద్యార్థుల తరుపున దన్యవాదములు తెలిపిరి. జనగణ మనతో సభ 7గం॥లకు ముగిసినది.

## అనంతపురం జిల్లా హిందీ ప్రచారకుల సమావేశము

అనంతపురం జిల్లా హిందీ పండితుల సమావేశము అనంతపురం ప్రభుత్వోన్నత పాఠశాలలో 12-7-81 ఆదివారం 10గం॥లకు జరిగినది. జిల్లా నలుమూలల నుండి పెద్ద సంఖ్యలో హిందీ పండితులు

విచ్చేసిరి. స్థానిక ప్రభుత్వకళాశాల హిందీ ఉపన్యాసకులు శ్రీ టి. వెంకటనాయుడుగారు సభకు అధ్యక్షత వహించి హిందీ ప్రచార రంగంలో అనంతపురం జిల్లా పాత్రను అభివర్ణించిరి. దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర కార్య వర్గ సభ్యులు శ్రీ పి. ఓబయ్యగారు ప్రధాన అతిథిగా పాల్గొని జిల్లా హిందీ ప్రచారకమండలి ఆవశ్యకతను గూర్చి చక్కగా వివరించిరి. పామిడి ప్రభుత్వ జూనియర్ కళాశాల ప్రధాన హిందీ పండితులు శ్రీ ఎ.బి. ఉమాశంకర్ గారు ప్రముఖుల సందేశములను చదివి వినిపించిరి. హిందీ ప్రచారక మండలి ఏర్పాటు కావలెనని సభ ఏకగ్రీవముగా తీర్మానించినది. ప్రస్తుత సంవత్సరము నుండి జిల్లా హిందీ ప్రచారక మండలి కార్యక్రమములను ప్రారంభించగలదు. స్థానిక హిందీ పండితులు శ్రీమతి భాగ్యమ్మ గారి వందన సమర్పణతో సభ జయప్రదముగా ముగిసినది.

## వాణి హిందీ విద్యాలయం

### విజయనగరం

28-6-81 ది సా॥ గం. 5-00లకు వాణీ హిందీ విద్యాలయ 5. వ వార్షికోత్సవము ఆర్యవైశ్య భవనము నందు శ్రీ పి. అశోక్ గజపతిరాజుగారి (M.L.A) ఆధ్వర్యములో వైభవముగా జరిగినది.

ముఖ్య అతిథిగా విచ్చేసిన శ్రీ అశోక్ గజపతి రాజు గారు సుమారు 200విద్యార్థినీ,విద్యార్థులకు ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాష మొదలగు హిందీ ప్రమాణ పత్రములు మరియు సంస్కృత ప్రమాణ పత్రములు అంద జేసిరి పై కార్యక్రమమును శ్రీ డా॥ K. సుబ్రహ్మణ్యంగారు (హిందీ శాఖాధిపతులు M.R College, VZM) అధ్యక్షులుగా వుండి నడిపించిరి.

స్థానిక హిందీ ప్రచారకులు శ్రీ వై. ఆంజనేయులు గారు తన వార్షిక రిపోర్టును చదివి విద్యాలయము యొక్క సాధక బాధకాలను వివరించిరి. హిందీ ప్రచారకులు శ్రీ పి. అనంతరావుగారు, శ్రీ సి. హెచ్ సత్యనారాయణగారు, కు. [illegible] జ్యోతిగారు తదితరులు హిందీ భాష [illegible] గూర్చి వివరించిరి.

కుమారి. ఎమ్. కె లక్ష్మి వందన సమర్పణతో సభ జయప్రదముగా ముగించెను.

## ప్రమాణ పత్ర వితరణోత్సవము

### పాడేరు

1981వ సం॥ మార్చి 18వ తేదిన బుధవారము స్థానిక ప్రభుత్వ జూనియర్ కళాశాల వార్షికోత్సవ సందర్భముగా జూనియర్ కళాశాలావరణలో హిందీ ప్రమాణ పత్రవితరణోత్సవము మాజీశాసన సభ్యులు శ్రీ. టి. చిట్టినాయుడు అధ్యక్షతను జరిగినది. ముఖ్య అతిథులుగా శ్రీ జి. నరేంద్రనాథ్ Msc., R.D.O. (పాడేరు) ఈ సమావేశములో పాల్గొనిరి.

శ్రీ బి. బంగారునాయుడు MA, Bse, BEd హిందీ లెక్చరర్‌గారు స్వాగత భాషణము పల్కిరి. ముఖ్య అతిథులు, స్థానిక రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు గారు హిందీ ప్రమాణ పత్రవితరణోత్సవము జరిపిరి.

ఈ సమావేశమునకు మాన్యులగు శ్రీ ఆర్. సారంగరావు M.A , BEd., గారు,శ్రీ వి సర్వేశ్వర రావు, డివిజనల్ పంచాయతీ ఆఫీసరు వారు మున్నగు పెద్దలు హాజరయిరి.

పలువురు ఈ కాలేజీలో హిందీసభ యొక్క పరీక్షలకు జరుగుచున్న శిక్షణను, స్థానిక కళాశాల హిందీ లెక్చరర్ శ్రీ రామదేవనాయుడుగారి హిందీ పట్ల ఎనలేని సేవను కొనియాడిరి. 1980 ఫిబ్రవరి నెలలో జరిగిన హిందీ పరీక్షలలో కృతార్థత జెందిన విద్యార్థినీ విద్యార్థులకు ప్రమాణ పత్రములు బహూకరించబడినవి.

జాతీయ గీతముతో సభా కార్యక్రమము ముగిసెను.

-:o:-